స్వతంత్ర ఫిలిమ్సు లిమిటెడ్ వారి

"పాలూ నేయీ కొందరి కిచ్చి
పచ్చని గంజి లే కందరినే
పస్తులతో పడి చావమందువా"?




డైరెక్షన్
ప్రసాద్

సినేరియో
తాపి

స్టుడియో
శోభనాచల



నటీనటులు

రాజ్యం, వరలక్ష్మి
ప్రసాద్
ప్రకాశరావు
ప్రభాకరరావు
రాళ్లభండి
శివరావు

— వివరాలకు —

స్వతంత్ర ఫిలిమ్సు లిమిటెడ్ :: మద్రాసు 17



ఆంధ్ర & రాయలసీమ డిస్ట్రిబ్యూటర్సు:

ప్రీమియర్ ఫిలిమ్సు లిమిటెడ్ :: బెజవాడ

# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక

సం. ౧, సంచిక ౯ జులై, 1947




సంపాదకులు :

చదలవాడ పిచ్చయ్య

కొమర్రాజు వినాయకరావు ప్రయాగ కోదండరామశాస్త్రి

# పేదలు

## శ్రీ శ్రీ

చూడు, చూడు, పేదలు !
పేదలు, పొగమేడలు !

యుగయుగాల దోపిడిలో
నరనరాల రాపిడిలో
నగదూసిన
పొగచూరిన
శాసనాల జాడలు !
జాలిజార్చు గోడలు !

చూడు, చూడు, పేదలు !
పేదలు, పొగమేడలు !

*     *     *

చూడు, చూడు, పేదలు !
పేదవాళ్ళ వాడలు !

నర నరాల వేదనలో
తర తరాల రోదనలో
బిక్కచిక్కి
బిక్కచచ్చి
పడిన బతుకుగోడలు ;
పాడుపడ్డ వాడలు !

చూడు, చూడు, పేదలు !
పేదవాళ్ళ వాడలు !

*     *     *

చూడు, చూడు, పేదలు !
పూలులేని కొండలు !

తరతరాల చెరసాలల
రకరకాల తెరచాటుల
పొదిగిటిలో
ఒదిగిలిపడు
వైరాగ్యపు పేదలు !
ఎడారిలో ఓడలు !

చూడు, చూడు, పేదలు !
పూలులేని కొండలు !

*     *     *

చూడు, చూడు, పేదలు !
పీడలతో క్రీడలు !
చూడు, చూడు, పేదలు !
సూర్యునితో క్రీడలు !
సూర్యునిలో సూదులతో
క్రీడలాడు పేదలు !



# శ్రీరంగం శ్రీనివాసరావు

## సవిమర్శక అసమగ్ర జీవిత చరిత్ర

రచన : ఆరుద్ర

★

## మహాకవి శ్రీశ్రీ

(నడుస్తూన్న నాటకం—బీభత్సరసప్రధానం)

అందలి పాత్రలు :

శ్రీశ్రీ : కవి, విమర్శకుడు, విజ్ఞాని, వేదాంతి, కవి

వెంకటరమణయ్య : అతని తల్లిదండ్రులు (చిన్నప్పుడే తల్లి చనిపోయింది కాబట్టి)

సుభద్రమ్మ : అతని సవతితల్లి (ఈవిడకూడా మరణించింది. "ప్రభవ" అనే కావ్య సంపుటి ఈవిడకే అంకితం)

వెంకటరమణమ్మ : అతని భార్య.

ఆంధ్రదేశం : అతని పెద్దబాలశిక్ష

తిక్కన, గురజాడ, జేమ్సుజాయిస్ } అతని గురువులు

నారాయణబాబు, పురిపండా, రుక్మిణీనాథ్ } అతని లఘువులు

కార్ల్ మార్క్సు, సిగ్మండ్ ఫ్రాయిడ్ } అతని సులోచనాల జోడు

కొంపెల్ల, గోరాశాస్త్రి, పఠాభి, అభిభాషలయువకవులు } అతని మిత్రులు

డబ్బు, దర్పం, పోలీసులు } అతని శత్రువులు

ప్రజలు : అతని విశ్వాసం

అశాంతి : అతని ఆవేశం

కర్షక కార్మిక విప్లవం : అతని ఆదర్శం.

సోరెన్ కీర్క్‌గార్డు : ఒక గొంతుక

సమయానుకూలంగా ప్లేగు, జగన్మిత్ర సమాజపు నాటకాలూ, Friends League Football Matches, మలేరియా, కన్యాశుల్కం, కమ్యూనిస్టులు, పోలీసు రిపోర్టులు, ఆల్కహాలాహలం, అపవాదులు, ఎర్ర గులాబీలు పందెపు గుర్రాలు మొదలైనవి.

రంగం : ఇక్కడ

కాలం : ఇప్పుడు

తెరలు : చరిత్ర, అంతర్జాతీయత, స్వాతంత్ర్యం.

## కొన్ని తారీఖులు

జననం: 2. 1. 1910
తల్లిమరణం: 1911½
అక్షరాభ్యాసం: 1915
మొదటి కావ్యరచన: 1916 ½లేక1917
విశాఖ పట్నంలో ప్లేగు: 1918
మొదటినవల:
(వీరసింహ విజయసింహులు)1919
ఎ.వి. యన్. కాలేజీలో చదువు: 1920
తొలి ప్రచురణ: 1925
(పరిణయ రహస్యం, డిటెక్టివ్ నవల)
వివాహం: 1925
కవితాసమితి స్థాపన: 1926
"ప్రభవ" ప్రచురణ: 1928
మద్రాసు - చదువుకి: 1928
మద్రాసు-విశాఖపట్టణం-విజయనగరం: 1928 - 30
టైఫాయిడ్ జ్వరం: 1930
పట్టభద్రత: 1931
నిరుద్యోగదశ: 1931 - 38
(అనేక చిల్లర ఉద్యోగాలు)
మహాప్రస్థానం గీతాలలో తొలి రచన: 2-6-33
"మరోప్రపంచం" రచన: 12-4-34
"ఆంధ్రప్రభ"లో ఉద్యోగం: 1938
ముగింపు: 1942
ఆలిండియా రేడియోలో: 1942
ఉద్వాసన: 1943
మిలిటరీలో: 1943
ఉద్వాసన: 1943
నటాలి నాటక కంపెనీలో: 1945
కంపెనీ ముగింపు: 1945
తండ్రి మరణం: 1945
హైదరాబాదు: 1946
స్వస్తి: 1947
ధ్వని: (రాబోయే స్వంతపత్రిక) 194 ?

## కొన్ని భోగట్టాలు

వృత్తి: శ్రీ శ్రీగా బ్రతకటం
వ్యాపకం: కవిత్వం
వయస్సు: 30 సంవత్సరాలు
(ఇప్పటికీ, ఎప్పటికీ)
సరదాలు: సమూహం,
కన్యాశుల్కం చదువు, చదువు
పొడుగు: 5' 5"
తూకం: 100 - 110 పౌన్లమధ్య
మనిషిని పోల్చుకునేందుకు గుర్తులు:
భ్రూమధ్యంలో కాల్పుమచ్చ, పద్యములో అనర్గళం, అనితరసాధ్యమైన మార్గం.
వాడేవి: సిజరెట్లు
అచ్చు అయిన పుస్తకాలు:
పరిణయ రహస్యం (కాపీల్లేవు)
ప్రభవ (డిటో)
వారం వారం (అంతే)
అచ్చుకావలసినవి:
మహాప్రస్థానం, మూడు మోతలు, ఖడ్గ సృష్టి, రేడియో నాటికలు, కథలు, విమర్శలు, క్రాస్‌వర్డుపజిల్సు
ప్రస్తుతం రాస్తున్నవి:
అనంతం (స్వీయచరిత్రాత్మక నవల)
కొన్ని దీర్ఘకావ్యాలు.

పై ముడి పదార్థాలు సేకరించుకొని శ్రీశ్రీ జీవిత చరిత్ర రచనకి ఉపక్రమించేను. గానీ శ్రీ శ్రీ అనే మాట సాధారణంగా ఆంధ్రుడి చెవిని పడిన వెంటనే అతడి మనస్సులో 'మరో ప్రపంచం' అనే పాటే అన్నిటికన్నా ముందుగా వినబడు తుందని నాకు నేను

హెచ్చరిక చేసుకొన్నాను. శ్రీశ్రీ కవిత్వానికి ప్రతినిధిగా ఆతని "మహాప్రస్థానం" గీతావళే మనముందు నిలబడడానికి కారణం ఏమిటి? ఈ గీతికల సంపుటానికి ముందు ఓపదేళ్ళు ఆ తరువాత పదేళ్ళూయి శ్రీశ్రీ రచన అనేకం ఉన్నా ఈ ఒక్క గీతావళే మనకి స్ఫురణకి రావడంలో విశేషం ఏమిటి?

ఈ ప్రశ్నలకి సమజాయిషీ చెప్పుకొన్న మీదటే శ్రీశ్రీ జీవిత చరిత్రా రచనకి పూనుకోవాలని గుర్తించేను.

మహాప్రస్థానం గీతాలనన్నీ అతను కిందటి దశాబ్దంలో రాశాడు. అవి అణగారిన ఆర్తులూ, చల్లారిన సంసారాలూ, దగాపడిన యువకులూ ఒక కొత్త ప్రపంచంకోసం ఎదురు చూస్తున్న రోజుల తోరణాలు. ప్రపంచంలో ఆరోవంతు భూతల స్వర్గంగా ఉంటూ ఉంటే మనం ఇంకా ఈ చీకటిలో రొంపిలో దేవులాడ వలసిందేనా? అని పీడితదేశాల లోని తాడితులు తర్కించుకొంటున్న రోజులవి మన దేశంలో ఒక సత్యాగ్రహం విఫలమై నైరాశ్యం ప్రజలలో అలముకున్న రోజులవి. సామ్రాజ్యవాదులూ, ధనిక స్వాములూ పగ్గాలు బిగించి కిందివారిని దోచుకొని స్వారీ చేస్తున్న రోజులవి. నిరుద్యోగం అందర్నీ కాల్చుకు తింటున్న రోజులవి. ప్రపంచం మరొక ప్రచండ యుద్ధానికి తయారవుతున్న రోజులవి.

ఈ వేదనలనీ రోదనలనీ శ్రీశ్రీ తన గీతాలలో ప్రతిబింబింప చేశాడు. అయితే సమాజ జీవితాన్ని యధార్థంగా ప్రతిఫలింప చేసినంత మాత్రాన ఏ కవీ కృతకృత్యుడు కాలేడు. కవి ఆనాటి జీవితాన్ని తన రచనలో చిత్రించి అభివృద్ధికి సరైన త్రోవలు చూపెట్టాలి. హృదయంలో చొచ్చుకునే సందేశం ఇవ్వాలి.

శ్రీశ్రీ కవితనిండా రకరకాల మనుష్యులున్నారు. ఏళ్ళుముదిరి కీళ్ళు కదలి ఆరిన కుంపటిలాంటి వర్షీయసులూ. నెత్తురునుండే శక్తులు పిండే సైనికులూ కూటికోసం కూలికోసం పట్టణాలకి చేదుకునే రైతుబిడ్డలూ కూలివాని నుదుట చెమట మహారాజు మనీపర్సు మాయే అనే మిథ్యావాదులూ, మనదీ ఒక బ్రదుకేనా? అని ప్రశ్నించుకొని జీవఫలం చేదువిషం అని తేల్చుకొన్న నిరాశావాదులూ కష్టం చాలక కడుపు మంటచే తెగించి సమ్మెలు కట్టే కార్మికులూ ఎందరో రకరకాల మానవు లున్నారు.

వీరందరికీ తాముఎలాంటి నరకంలో జీవిస్తున్నారో శ్రీశ్రీ చూపెట్టాడు. వాళ్ళంతా పాల్గొనే బీభత్సరస ప్రధానమైన జీవితాన్ని వాళ్ళకే ప్రదర్శించాడు. అయితే "ఈ బాధలు అనవసరం మనం సుఖంగా బతకగలం" అని ఒకే ఒక్క సందేశం ఇచ్చాడు.

"పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
దగాపడిన తమ్ములార!"
మీరంతా ఐక్యమై
"రారండో రండో రండి"

అని పిలుపు ఇచ్చేడు. పాపపంకం నుండి పద్మాలు పుట్టించిన" యన్మహా "కార్మికస్వర్గం" పిలుపు తాను విన్నాడో

తన్మహా రాజ్యం కోసం "పదండి ముందుకు" అని వీళ్ళందర్ని నడిపించేడు. చివరకు జగన్నాథుని రథచక్రాల ఆగమనం చూశాడు. తన సోదరులనందర్నీ పిలిచి,

"ఈ లోకం మీదేనండి
ఈ రాజ్యం మీరేలండి"
అని సందేశం ఇచ్చేడు.

"స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులై ఇళ్ళు లేచి జనావళికి శుభంపూచి.... జగమంతా జయిస్తుంది" అని కవి చెపుతున్నా

"నిజంగానే నిఖిలలోకం
నిండు హర్షం వహిస్తుందా?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా?"

అనే సందేహ జీవులు పెదవి విరుస్తున్నారు. వాళ్ళని చూసి శ్రీశ్రీ

"ఈ స్వప్నం నిజమవుతుంది
ఈ స్వర్గం రుజువవుతుంది"
అని హామీ ఇచ్చేడు.

అందుకే-మన యెదుటనున్న నరకొన్నిచిత్రించి మనం తలలుకనే స్వర్గానికి దారి చూపుతున్నందుకే - శ్రీశ్రీని తలచుకొన్నప్పుడుమనకు "మరో ప్రపంచం" పాటే జ్ఞప్తికొస్తుంది.

అయితే ఇలా ఆ "వ్యధార్త జీవిత యధార్థ దృశ్యం" శ్రీ శ్రీ ఎలాచిత్రించగలిగేడు అనే మరో ప్రశ్న బయలుదేరుతుంది. సమాధానం కోసం అతడి జీవితాన్ని పరిశీలిద్దాం, రండి.

* * *

శ్రీ శ్రీ జననం 1910 వ సంవత్సరంలో. ఆయేడే కవిబ్రహ్మ గురజాడ కృతకభాషని వెలివేసి, పాషాణచ్ఛందస్సుకి దేవిడీమన్నా చెప్పి ప్రజల అందుబాటులో ముత్యాలసరాలు సవరించేడు. ఆ యేడాదే బరంపురంలో అర్థంలేని కులభేదాలకి స్వస్తిచెప్పి, అనవసరమైన ఆదారాలకి తిలోదకాలిచ్చి అభ్యుదయకాములు నానా వర్ణసహపంక్తి భోజనం చేశారు. వివిధ దేశాలు ఒక ప్రపంచ యుద్ధానికి తయారవుతున్నాయి. ఈ సంస్కరణల, సంఘటనల వాతావరణంలో శ్రీ శ్రీ అనే శిశువు జీవితం ప్రారంభమయింది.

అతి చిన్నవయస్సులోనే అక్షరాభ్యాసం అయిన ఏణ్నర్ధానికే శ్రీ శ్రీ తన తొలిరచన చేశాడు. అదొక కందపద్యం దానిలో యతి ప్రాసలూ, గణాలూ ఏవీ లేవు. ఒక పొట్టిపాదం, ఒక పొడుగు పాదం-ఈవిధంగా నాలుగు పాదాలు నరిపెట్టుకొని కందం చెప్పి కనిసనిపించుకున్నాడు. తన తొలిపద్య రచన తర్వాత శ్రీ శ్రీ అనేక నాటకాలు వ్రాసి వాటినిండా ఇలాంటి కందాలేనింపేడు.

ఈ వెర్రిరాతలు చూసి కుర్రాడిని సరైన తోవలో పెడదామని రమణయ్యా మాష్టరుగారు (శ్రీ శ్రీ తండ్రి: గణిత శాస్త్రజ్ఞుడు) సులక్షణసారాన్ని కొని పెట్టారు. దాన్ని పారాయణ చేస్తూండగానే అప్పకవీయాన్ని చదవమని ఇంకొకరు సలహా యిచ్చారు, అదీ శిరసావహించాడు శ్రీ శ్రీ.

తర్వాత ప్రబంధాలు కొని, తెచ్చి చదవడం మొదలెట్టాడు. మనుచరిత్ర వి

కూడ బలుకొక్కన్నాడు. శ్రీనాధుణ్నీ, రామకృష్ణకవినీ అవగాహన చేసుకొం దికి ప్రయత్నించాడు. వాళ్ళ ఒరవడిని పద్యాలు రాసిందికి ప్రయత్నించాడు. పదేళ్ల నిండని కుర్రాడి కవిత్వం ఎలా ఉంటుందో అలాగే ఉండేవి ఆపద్యాలు. శ్రీ శ్రీ కవితావృక్షం అప్పుడే విత్తనం లోంచి వస్తున్నది వేరు ఇంకా జీవితం లోని ఖనిజ ద్రావణాలని పీల్చే శక్తిలో లేదు. ప్రబంధాల బీజదశాలలోని ఆహా రాన్నే ఉపయోగించుకొని శ్రీ శ్రీ రచన చేశాడు.

ఈ పద్యరచన ఇలా సాగుతూ ఉండ గానే శ్రీ శ్రీ వెంకట పార్వతీశ్వర కవుల నమూనా తీసుకొని అపరాధ పరి శోధక నవలలు పేనడం మొదలు పెట్టాడు. ఆకుపచ్చ సిరా వాడుతూ అనేకమంది హంతకాంతక చక్రవర్తు లను సృష్టించాడు. కాలూరాయి అనే డిటెక్టివు నవల వస్తుందన్న ప్రకటన చూసి ఆనవల ఇంకా బైటికి రాకముందే అలాంటి పేరుతో ఒకటి రాసి ముగిం చాడు శ్రీ శ్రీ. (దానిపేరు "గోకు లాయి" అని. తొలిరచనలలాగే అదీ హరించుకుపోయింది.)

అతనికి ఎనిమిదేళ్ళు రాగానే ఒక ప్రపంచయుద్ధంలో అలిసిపోయి దేశాలు సంధిపత్రాలమీద సంతకాలు పెట్టాయి. విశాఖపట్టణంలో ప్లేగువ్యాధి అలము కుంది. ప్లేగుకి భయపడ్డ అన్ని కుటుం బాలలాగే శ్రీ శ్రీ తన మేనబావలతో దిమిలి అగ్రహారానికి వలసపోయేడు. అప్పుడే అతనికి పల్లెటూళ్ళు సాయించ లేదు. కారణం పట్నవాసాలలోని దరి ద్రమేకాక పల్లెటూళ్ళలో అజ్ఞానంకూడా ఉంటుంది.

1919 లో శ్రీ శ్రీ "వీరసింహ విజయసింహులు" అనే నవల ఒకటి రాశాడు. ఇందుకు ప్రోద్బలం అతడు జగన్మిత్ర సమాజపు నాటకాలలో బాల పాత్రలు వేసేవాడు. ఆ రోజుల్లో ప్రతి ఆంధ్రుడూ తానొక రసపుత్రవీరుణ్ని అనుకునేవాడు. నాటకాలు ఈ భావాన్ని ప్రజల్లో పోసేవి. "రసపుత్ర విజయం" అనే నాటకంలో శ్రీ శ్రీ అజితసింహుడి పాత్ర వేసేవాడు. రాజపుత్ర వీరులతో ఆరావళీ పర్వతాలనీ, పవిత్ర హిందూ భూమినీ చిత్రించి శ్రీ శ్రీ ఆనాడు హైందవుల సద్బోధించిన ప్రబో ధంలో తన వాటాని పూర్తిచేశాడు.

శ్రీ శ్రీ కి పదేళ్లు నిండేయి. ఏ వి. యన్. కాలేజీ హైస్కూల్లో చేరాడు. అప్పటికతనిలో పారే కవిత ఒక దారిని పడ్డాది. పద్యం వ్రాసి, గణ విభాగంచేసి. "అమ్మయ్య అన్ని గణాలూ పడ్డాయి. అప్పకవి మరిదెబ్బ లాడడు" అనుకోడం పోయింది. యతి ప్రాసలకి తణువుకోవడం అయిపోయింది. అతని కవితావృక్షం మెల్లిగా వేరు తన్నడం ప్రారంభించింది.

1920 లో సాహితీసమితి రాజ్యా నికి వచ్చింది. శ్రీ శ్రీ సమితిలోని కొందరిని ఆరాధ్య దేవతల్ని చేసు కున్నాడు. వాళ్ల ఎగుమతి చేసిన నల్ల మందుకి తనూ కొంత ఆర్డరు ఇచ్చాడు. కాశూరి నరసింగరావుతో, నారాయణ బాబుతో కలిసి కవితావ్యాసంగం చేస్తూ ఉండేవాడు. కాశూరి వెంకట పార్వతీ

శ్వరకవుల కాలిబాటను సుదీర్ఘమైన ద్విపదమాలికలూ, గీతమాలికలూ వేస్తూ ఉండే, శ్రీ శ్రీ క్లిష్టకష్టప్రాసలు వెతుక్కొని సాముగరిడీగా తయారవుతూ ఉండేవాడు.

సమాసాలు సీలలు బిగించినట్లు కట్టుదిట్టంగా ఉండేవి. సాహితీ సమితిలోని కొందరు ఆరాధ్య దేవతలు ఉత్సవ విగ్రహాలయిపోయారు. శ్రీ శ్రీ తన గుండెల్లో కొత్తదేవతల్ని నిలుపుకున్నాడు. కాశూరి కాపీపుస్తకాల్లోకూడా వసుచరిత్ర రాయప్రోలు అబ్బూరి వరవళ్ళు పెట్టారు. కాశూరి శ్రీ శ్రీ కలిసి వృత్త రహస్యాలను పరిశీలిస్తూ ఉండేవారు. ఇప్పటికి శ్రీ శ్రీ కవితావృక్షం పూర్వ గ్రంథాలలో బాగా నాటుకుంది.

అది 1925 వ సంవత్సరం. శ్రీ శ్రీ కి వివాహమైన యేడు. (శ్రీ శ్రీ వివాహ ఘట్టం ఒకచిన్న డిటెక్టివు నవల.)

శ్రీ శ్రీ తన వివాహానికిముందు "పరిణయ రహస్యం" అనే అపరాధ పరిశోధక నవలిక రాసి ప్రచురించాడు. అప్పటితో అతని వచన రచన తాత్కాలికంగా ఆగిపోయింది.

1926 లో పురిపండా అప్పలస్వామి, వడ్డాది సీతారామాంజనేయులూ, శ్రీ శ్రీ కలిసి కవితా సమితి స్థాపించారు. దానిలో విశాఖజిల్లా కవులంతా చేరి సాహితీ సమితి సరుకుతో సరితూగే మత్తు పదార్థాల్ని తయారు చేసి దేశమంతటా సరఫరా చేస్తూఉండే వారు.

అవి కృష్ణశాస్త్రి కవిత్వానికీ, స్థానం నాటకానికీ, సైలెంట్ సినిమాలకీ, ఫుట్‌బాల్ ఆటలకీ రోజులు. శ్రీ శ్రీ కి వీటన్నిటిమీదా మోజు. ఈ జాబితాలో విశ్వనాథ శిల్పాన్ని కూడా చేర్చుకొని "ప్రభవ" అనే పేర గ్రంథరూపేణా అచ్చువేసిందికి తగినన్ని పద్యాలు రాశాడు.

పురిపండా పరిచయ వాక్యాలతో "ప్రభవ" అచ్చయింది. "ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక" దాన్ని అనుకూలంగా విమర్శించింది. "భారతి"లో కొంపెల్ల జనార్దనరావు ఒకటి రెండు మాటలతో కోప్పడి ఊరుకున్నాడు. ఆయనఅన్నట్లు "ప్రభవ"లో సార్థకత కంటె సమాసతత్పరత హెచ్చు. ఉదాహరణ కొక్కపద్యం,

"ఎఱుఁగవే నన్ను లోకభీకరమహోగ్ర
ఫణి విషస్ఫీత మృత్యురూపిణిగ నీవు?
నీ హృదంతర సదన సంస్థిత కరాళ
శిఖి శిఖాచ్ఛట నని గ్రహించెదవా లేవా?
శ్రీప్రద క్రకచోగ్ర దంష్ట్రా ప్రభూత
విస్ఫురత్తేజమునఁ దాండవించు నన్ను
మృత్యుదేవతగా మది నెఱుఁగ లేవా?"

ఈ నమూనా చాలు. అయితే శ్రీ శ్రీ కవితా వృక్షం అప్పటికి పెరటిగోడ అంతవఱకే పెరిగింది. పెరటిలో ఉన్న వాతావరణం తప్ప మరేదీ కనబడలేదు తక్కిన అందరు కవుల్లాగే అతడూ "దంత ప్రాకారం"లోనే కూర్చున్నాడు. అయితే "ప్రభవ" రచనఅతనికొక ఉపకారం చేసిపెట్టింది. పదస్వరూపాన్ని అతడు క్షుణ్ణంగా బోధపరచుకున్నాడు. "దరులొరసిపారుగాంగ నిర్ఝరిణికరణి— క్రేళ్ళురుకు లేడివలె త్రుళ్ళులాడు" కవిత్వం రచించిందికి తగిన సరంజాం అతడు సిద్ధపరచుకున్నాడు.

1928 లో "ప్రభవ" పూర్తయాక బి.ఎ. చదువుకి మద్రాసు చేరుకున్నాడు. అక్కడ మొట్టమొదటిసారి కొంపెల్ల జనార్దనరావుతో పరిచయం ఏర్పడ్డాది. అతనితో కలిసి హైకోర్టు, ట్రిప్లికేన్ సముద్ర తీరాలలో ఆత్మపరీక్ష చేసుకున్నాడు. "ఈ గీతానికి కృష్ణశాస్త్రి. ఈ పద్యానికి విశ్వనాధ. ఈ వృత్తానికి ఇద్దరూ influence" అని తమ్ముతాము మోసగించుకొనకుండా తీవ్రంగా పరీక్షించుకున్నారు. తమ రచనలన్నీ second - rate poetry అని తేల్చుకున్నారు. ఇద్దరూ సొంత గొంతుకలని వెదుక్కుందామని బయల్దేరారు.

1929 లో శ్రీ శ్రీ సుప్తాస్థికలురాసి తన జీవిత కావ్యంలో ఒక అశ్వాసాంతానికి వచ్చాడు. ఒక కుబుసం విడిచాడు.

1930 లో టైఫాయిడ్. సరిగ్గా 63 రోజులు మంచం పట్టాడు. 1931 లో మద్రాసు వెళ్ళి బి.ఏ. (జంతుశాస్త్రంతో) పూర్తిచేసి విశాఖపట్టణానికి వచ్చాడు. శ్రీ శ్రీ లో ఆకలియుగం ప్రారంభించింది. జనార్దనరావు మైత్రితో మద్రాసులోని ఆంగ్ల కవితా వ్యాసంగంతో అతనిలో "ప్రభవ" ఫక్కీ ప్రాభవం పోయింది. "ఎటుక వదరాని ఎచటికో ఎగసి" పోకుండా భువికి దిగివచ్చాడు. తన పెద్దబాలశిక్షని మళ్ళీతీసి చదువుకున్నాడు. వడ్డించిన విస్తరిలాంటి జీవితాలవాళ్ళకి" తుఫానులో తడిసిన జడిసిన జీవితాల వాళ్ళకీ మధ్య ఉండే వ్యత్యాసం అతడికి బోధపడింది.

విద్యాభ్యాసం పూర్తిచేశాడు కాబట్టి ఏదో ఒక ఉద్యోగంలో చేరాలి కాబట్టి విశాఖపట్టణం ఏ. వి. యన్. కాలేజీకి చెందిన హైస్కూల్లో సైన్సు మాస్టరుగా కుదిరాడు. గతి తార్కిక భౌతికవాదం. చారిత్రక భౌతికవాదం చదవడం ప్రారంభించాడు. ఆ రోజుల్లో అతడి జీవితంలో అలజడి. ఆందోళన అలముకున్నాయి. ఇటుచూస్తే స్వరాజ్య శంఖారావం. అటు చూస్తే స్వాతంత్ర్య ఢంకాధ్వానం ఎటు చూసినా స్వేచ్ఛకోసం తహతహలు.

అప్పుడతనికి గురజాడ అప్పారావు సాక్షాత్కరించాడు. అప్పుడతని సమస్యల పరిష్కారం అవగాహనమయింది. ప్రజలకు అందుబాటులో ప్రజలను ముందుకు తీసుకుపోయే రచనలు సాగించు అని అనుభవం బోధపరిచింది. శ్రీ శ్రీ ముత్యాల సరాలమీద తీవ్రకృషి చేశాడు. (చూ."ఉదయిని"లోవ్యాసం) సమాజంలోని దేశికవితలను జాగ్రత్తగా విన్నాడు. ప్రజల బ్రతుకులలో అదివరకే మెదలుతున్న ప్రబల చలనం" గమనిస్తూవచ్చాడు."అనామధేయ మహాకవులకి అభివాదాలు" సమర్పించాడు. "పాటకపు మహాజనుల పాటలలోని ప్రాణవాయువులు" పీల్చుకున్నాడు. "రోజు రోజుకీ రకరకాల ఛందస్సులు అతనికి తమ రహస్యాలను బోధిస్తూ వచ్చాయి. వాటివాటి గమనంలో సమాజ జీవిత గమనం స్ఫురింప జెయ్యాలని" అతడు మధనపడ్డాడు.

2-6-33 నాడు అతను తన మధనంలో ఒక ఒడ్డుకు చేరుకున్నాడు. అతడు అంతకు ముందంతా విన్నవి కన్నవి జాతిజనులు పాడుకొనే మంత్రముగా విన్నవించ దలచుకున్నాడు.

ఘాటలకై వెదుకాడగబోతే అవిపుంఖానుపుంఖంగా శ్మశానాలవంటి విఘంటువులను దాటి, వ్యాకరణాల సంకెళ్ళు విడిచి ఛందస్సుల సర్ప పరిరంభం వదిలి వడివడిగా వెలువడినై. ఆ రాత్రే శ్రీ శ్రీ విశ్వ వృష్టికి అశ్రువొక్కటి ధారవోసి "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అని వెర్రి గొంతుకవిచ్చి మ్రోశాడు. జయభేరి మ్రోయించి మహాప్రస్థానానికి బయలుదేరాడు.

కాలం అతనికి కావ్యవస్తువుని పరిపక్వం చేసింది. ఆ సమయానికే శ్రీశ్రీ తన పంవిధానం అనే ఆయుధాన్ని సానపట్టి సిద్ధంగా ఉన్నాడు. దీని ఫలితమే "మహాప్రస్థాన" కావ్యసంపుటి.

"నేను సైతం" గీతాన్ని రాశాక అతనికి సొంత గొంతుక వినబడ్డాది. చేయవలసిన యాత్రలో మజిలీలన్నీ బోధపడ్డాయి దర్శించవలసిన క్షేత్రాలన్నీ లెక్కకు తేలాయి. దూరంగా వినుదారుల్లో విహరించే అందని అందంగా కవితని ఊహించుకున్నంత సేపూ ఆమె సాక్షాత్కరించ లేదనీ, సమాజ జీవితంలోనే కవిత్వ సౌందర్యం ఉందనీ అతను గుర్తించు కున్నాడు. అందుకే సమాజ జీవితపు జననం తన కవనంలో స్ఫురింపజెయ్యాలని నిశ్చయించు కున్నాడు.

ఇప్పటికి శ్రీశ్రీ కవితావృక్షం వివిధ పారస్వాలలో శాఖోప శాఖలుగా విస్తరించింది. మ్రాను మాత్రం తెలుగు సాహిత్యంలోనే వుంది. వేళ్ళు కూడా శాఖోప శాఖలుగా జీవితపు లోతులలోకి తన్నుకొని అనేకానుభవాలను ఆహారంగా సేకరిస్తున్నాయి. అతను E. A. Poe; Swinburne; Browning, Bandelaise మున్నగు కవులను మథించాడు. వారి technique వారసత్వం ప్రకటించు కున్నాడు. గురజాడ ప్రవేశపెట్టిన విప్లవాన్ని అందుకున్నాడు.

శ్రీ శ్రీ విశాఖపట్టణంలో ఈ ప్రయత్నాలు చేస్తుఉంటే మద్రాసులో కొంపెల్ల జనార్దనరావు "యువలోకానికి ప్రతినిధి"గా "ఉదయిని"ని స్థాపించిందికి గాను పరిస్థితులతో పోరాడు తున్నాడు. శ్రీ శ్రీ అతనికి ధైర్యం రవాణా చేశాడు. మారుగా జనార్దనరావు శ్రీశ్రీకి ప్రోత్సాహాన్ని పంపించేడు.

కసినం ఒక్కడేనా తన ప్రయత్నాన్ని హర్షించేందు కున్నాడన్న ధైర్యంతో శ్రీ శ్రీ ముందుకు సాగేడు. ఏ మంటే ఆ రోజుల్లో "ప్రేయసి" ఇంకా కవిత్వాన్ని పరిపాలిస్తోంది. యువకులు భావకవిత్వాన్ని తప్ప మరి దేన్నిచ్చినా తీసుకోలేనట్టు ముఖాలు ప్రదర్శిస్తున్నారు. కాని ముందుకు సాగాడు శ్రీ శ్రీ.

తాను చూచిన నరకలోకంలోంచి సోమరులు వినా అందరినీ "మరో ప్రపంచం" మార్గాన పట్టిందికి పిలుపు ఇచ్చాడు. మీరంతా ఒకసై మరో ప్రపంచాన్ని, మహాప్రపంచాన్ని ధరిత్రి నిండా నింపండని కార్మిక కర్షకులని హెచ్చరిక చేశాడు తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకున్నాడు. ఇది 1934 లో.

శ్రీ శ్రీ వ్యక్తిగత జీవితంలో చేదు రోజులు బిరబిగుసుకుంటున్నాయి.

ఉద్యోగాలలో అసంతృప్తి. చేదామన్న పనికి అన్నీ విఘ్నాలే. కుడి ఎడమల ముందు వెనకల దగా. "ఉదయిని" ఆగిపోయింది. తర్వాత తర్వాత జనార్దనరావు మరణం. "తలవంచుకు వెళిపోయావా నేస్తం, సెలవంటూ ఈలోకాన్ని వదలి" అని శ్రీ శ్రీ తన మహాప్రస్థాన గీతాలను జనార్దనరావుకి అంకితము చేశాడు.

ఎన్నాళ్ళు కాచుకొని కూచున్నా మరో ప్రపంచంకల నిజంకాలేదు. సరిగదా పెట్టుబడిసంఘాలు కుట్రనీ, కూహకాన్ని పన్నుతున్నాయి. శాంతి వినాశనానికి హిట్లరు దుష్టశక్తుల్ని కూడ గట్టుకుంటున్నాడు. అంతర్జాతీయ పరిస్థితులమీద నల్లరంగు అలముకుంటున్నాది. శ్రీ శ్రీ "లే లే రష్యా" అని ఆలపించాడు.

వివిధ దేశాలు యుద్ధాన్ని పసిగట్టాయి. ప్రపంచం అట్టుడికి పోతున్నాది. వ్యక్తిగతంగా 'నైరాశ్యం, వైఫల్యం వాతబడ్డ శ్రీ శ్రీ కవితలో మరో మార్గాన్ని చూచుకోక తప్పిందికాదు. అందుకే మొదటి ప్రపంచ మహాయుద్ధానంతరం పాశ్చాత్య దేశాల కవుల ధోరణులకు లొంగిపోవడం ప్రారంభించాడు రకరకాల ఇజాలను వెతికాడు. తనెక్కడేనా పిలిచిందికి చోటు దొరుకుతుందేమో అని. సర్రియలిజంలో ఒక గూడు అతనికి కనిపించింది.

అంతర్జాతీయంగా కుట్రలు పూర్తి చేసుకుని దేశాలు యుద్ధంలోకి దిగాయి. శ్రీ శ్రీ తన గదిలో ఒంటరిగా నిద్రకు వెలియై కూర్చొని ఒక "కేక" వేశాడు. ఆ కేక వేశాక అతడు జగన్నాధుని రథ చక్రాల ఆగమనాన్ని చూశాడు. ప్రజలకు దాన్ని తెలియచేశాడు. ఈ యుద్ధముతో ఇటో అటో తెగిపోతుందని రైతు-కూలీ ప్రజారాజ్యస్థాపన నిశ్చయమని ఉద్ఘాటించాడు.

ఇంతతో తన పని అయి పోయిందని శ్రీ శ్రీ సర్రియలిజంలోనికి నిష్క్రమించాడు. నాటి నుండి నేటిదాకా అశాంతిలో ఈదుతున్నాడు. అందని దేవి కోసమో వేటాడు తున్నాడు.

కానీ, శ్రీ శ్రీ పనిఅయి పోలేదు అతను ఏబాధలు, ఏగాధలు అవగాహన చేసుకొనిమహాప్రస్థానగీతాలనిరచించాడో ఆబాధలు, ఆ గాధలుఇంకా సంఘంలో వికిర తాండవం చేస్తున్నాయి. పరిస్థితులు అప్పటికన్నా దుర్భరంగా ఉన్నాయి. అభ్యుదయాన్ని వాంఛించేవారు అనేకులు నిరపరాధులై చెరసాలలలో చిక్కుతున్నారు. లోహరాక్షసుల పదఘట్టనచే కొన ప్రాణంతో కనలేవాళ్ళు కష్టం చాలక కడుపుమంటచే తెగించి సమ్మెలు కడుతున్నారు. నానాటికీ కూటికీ గుడ్డకి కరువై పోతున్నది. పౌరహక్కులు కూడా ఏష్యమై పోతున్నాయి స్వార్థపరులు మత విభేదాలను ప్రజలలో రెచ్చగొట్టి సొంతలాభం చూసు కుంటున్నారు. సామ్రాజ్యవాదులు కొత్త కుట్రలని పన్ని తమజండాలనింకా ఎగురవేస్తూనే ఉన్నారు, దేశం అశాంతికీ, అరాజకానికి ఎర కాబోతున్నాది.

ఈ బీభత్సాలను మనం సమూలంగా నాశనం చేసి వర్గరహిత స్వర్గాన్ని

నిర్మించుకోవాలి. దానికి కవులే నాయకత్వం వహించాలి.

ఇట్టి పరిస్థితులలో ఏ మహాకవీ ఊరుకోడు. కవి హృదయంలో ఉండే విపంచిమీద సమకాలిక పరిస్థితులు ప్రసరించిన వెంటనే తంత్రులు స్పందించక మానవు. కాబట్టి శ్రీ శ్రీ తన శ్వైశారుతాన్ని తిరిగి అందుకో గలడు. తన స్థానంలో నిలబడి పర్జన్య శంఖాన్ని పలికించగలడు. యువకులను నడిపించ గలడు.

శ్రీ శ్రీ కవితా వృక్షం పూర్తి పరిణామాన్ని పొందింది. ఇంక ఊడల్ని వెయ్యడమే తరవాయి. ఆ ముహూర్తం ఆగమించే సూచన లగపడుతున్నాయి. Surrealism, Apocalypticism, Existentialism ఇవన్నీ పరిశోధనా గారాలు మాత్రమే. వీటినుండి సారాన్ని సేకరించి తన విత్తనాలని మళ్ళా ఏ నేలలో మహా ప్రస్థానాన్ని నాటేడో ఆ నేలలోనే జల్లుతాడు. వివిధ అభ్యుదయోద్యమాల ఎరువుల్ని వాడుకుంటాడు.

శ్రీ శ్రీ ఎల్లప్పుడూ ఆకుపచ్చగా ఉండేచెట్టు. వేళ్లు సుస్థిరంగా సంప్రదాయంలో పాతుకుని ఉన్నాయి. ఆకులు సూర్యకిరణాలని పీల్చుకుంటున్నాయి. కలకాలం 30 ఏళ్ళ వయస్సుతో ఈ చెట్టు అనేక ఉద్యమాలకు నీడ నిస్తుంది.

# లే లెమ్మోయ్!

## శ్రీ కె. వి. కృష్ణమూర్తి

లేలెమ్మోయ్, లేలెమ్మోయ్!
విశాల మానవ సభ్యతా వినూత్న తేజము ధరించెనోయ్!
ప్రాక్పశ్చిమ ప్రాకారములో శ్రామికయుగ మారంభమోయ్
గభీరాశయులకనంత సింధువుల కసంతృప్తియాచో
ఇకెంతకాలము చిన్నమొగ్గవలె మంచు బిందువులు నీకు?

విశ్వమానవాభ్యుదయమే ప్రపంచశాంతికి ప్రాణము
ఇకెంత కాలము
నికిందపను, జముషీదును సుషుప్తిలో వినుచుందువు?
భూగర్భంబున నవీన భాస్కరు డుద్భవమౌతరిసీ,
పతిత తారల గతిని గూరిచీ వగపదేటికే నభమా!

శృంఖలమ్ములను విరుగ గొట్టెను మానవుడు
ఇకెంతకాలము కన్నీరొల్కెదు గతకాల స్వర్గానికి?
పిచ్చిశలభమా! దీపారాధన దాస్యము విడిచి
విసర్గ తేజోనిలయము నిండుము లేలెమ్మోయ్. లేలెమ్మోయ్!

# గత్యంతరం

## శ్రీమతి కొమర్రాజు పద్మావతి

మా తల్లిదండ్రులు నా పెళ్ళి చిన్నప్పుడే చేసేశారు. నేనప్పుడు స్కూల్లో చదువుతుండేదాన్ని. నన్ను ఇస్తానన్న అబ్బాయిని నేనెరుగుదును. నాకు ఆ అబ్బాయంటే ఏమాత్రంకూడా యిష్టంలేదు. అందుకని, మా అమ్మా వాళ్ళవద్ద నేనతన్ని చేసుకోనని కాళ్ళా వేళ్ళాపడి ప్రాధేయపడ్డాను. ఎంతో చివరకి వేడుకున్నాను. ఏడ్చాను కూడా. కాని, లాభం లేకపోయింది. మావాళ్లు అతను ధనవంతుడుకదా అనుకున్నారు. అతని తల్లిదండ్రులు కూడా, నా సంబంధం అంటే, అంతగా ఇష్టపడలేదు. అతను చదువులో, ప్రతీ సంవత్సరం పల్టీలు కొడుతూ వుండేవాడు. నేను ప్రతీయేడూ, తప్పకుండా ప్యాసవుతూ వుండేదాన్ని. ఆ అబ్బాయికి నామీదవుండే మోజు, నన్నే చేసుకోవాలనే పట్టుదల చూసి పెండ్లి నిశ్చయించారు.

నా పెండ్లి అయింది. అతనితోపాటు నేనుకూడా బొంబాయి చేరుకున్నాను. ఆనాటినుండీ, కష్టాలు ఒకదాని తర్వాత మరొకటి మీద విరుచుకుపడ్డం మొదలెట్టాయి. నన్ను కాలేజీకి పోనివ్వడు; చేతికి దమ్మిడీ ఇవ్వడు. ఒక రాజకీయాలేమిటి? సంఘసంస్కార మేమిటి? రాత్రింబవళ్లూ ఒకే సంఘర్షణ!

చిట్టచివరికి, ఏదో విధంగా, ఒక స్కూలు లైబ్రరీలో నౌకరీ కుదుర్చుకున్నాను. ఈ ఆసరా దొరకగానే, తిరిగి నేను కాలేజీలో చేరాను. ఆయన దుకాణానికి వెళ్ళగానే నేను ఇంటికి తాళం వేసి, కాలేజీకి పోయేదాన్ని. కొన్ని గంటలు కాలేజీలోనూ, కొన్నిగంటలు లైబ్రరీలోనూ కాలం గడిపేదాన్ని. ఈ సంగతి ఎప్పటికైనా తెలియకుండా ఉంటుందా? ఇంకేం! తెలియగానే అతను భగ్గున మండిపడ్డాడు. నన్ను గదిలోపెట్టి తాళంవేశాడు. ఇంకా నాకు జన్మఖైదే!

"నీకు స్వతంత్రం ఎక్కువై పోయిందే యీమధ్య. ఇంక నిన్ను వాకిట్లోకూడా అడుగు పెట్టనివ్వను." అని గదమాయించాడు.

నేనామాట విన్నప్పటినుంచి, కంటికి మంటికి, ఏకధారగా ఏడుస్తూవుండేదాన్ని. అంతకంటె నాచేత ఏమౌతుంది? అతను చివరికి నన్ను ఖైదులోంచి వదలక తప్పిందికాదు. లేకపోతే, ఆయనకు తిండీ, తిప్పలూ ఎట్లా! ఈసారి ఆయనకు తెలిసే, నేను మళ్ళీ నా పనిలోనూ చదువులోనూ నిమగ్నురాలైనాను. మళ్ళీ మాటి మాటికి మా యిద్దరిమధ్యా నిప్పు రగులుకుంటూనే వుంది. నారోజులన్నీ ఏడుపుతోనే గడుస్తున్నాయి.

ఇంతట్లోకే యుద్ధం ఆరంభమైంది

జపానువాళ్ళ పైశాచిక సైన్యాలు బర్మా సరిహద్దులుదాటి మాతృదేశంలో కాలు పెట్టాయి. స్వదేశ సంరక్షణకు నడుం బిగించవలసిన క్లిష్టసమయం వచ్చింది. "ఆడవాళ్ళనుకూడా యుద్ధంలోకి తీసుకుంటాము" అని పత్రికల్లోపడిన ప్రకటన చూశాను. "అమ్మయ్యా. బ్రతుకు జీవుడా" అనిపించింది. వెంటనే రిక్రూటింగు ఆఫీసుకువెళ్ళి నాపేరు ఇచ్చాను. ఇంటికివచ్చి "ఇంకా నేను నీ చేతుల్లో లేనులే. నేను సైన్యంలో చేరాను" అని ఆయనకు చెప్పేసు. ఇంత చూసుకో అయన ఎగిరాడు. జుట్టు పీక్కున్నాడు. అంతకంటె నన్నేంచేస్తాడు? పంజరంలో చిలుక పైకెగిరిపోయింది.

నాలుగేళ్ళు నర్సుగా యుద్ధంలో సేవ చేశాను. యుద్ధం ముగిసింది. మళ్ళీ మొదటి సమస్యే ఎదురైంది, ఇప్పుడు ఎక్కడికి వెళ్ళనూ?

అయన ఆ వూళ్ళోనే వున్నాడు. ఈ నాలుగేళ్ళలో గుణం మారకూడదా? అతనితో ఏదోవిధంగా రాజీపడితేనో! నిశ్చయం చేసుకున్నా. నా హృదయం ఆనందంతో ఉర్రూతలూగింది. ధైర్యం చేసి అయనకి ఒక ఉత్తరం వ్రాశాను. ఆయన వుంటున్న యింటికి వెళ్ళాను. నాఅనుమానం రూఢి అయింది. పుకారు నిజమైంది. భోగం కనకం అతనివళ్ళో పడుకుని సరసాలాడుతుంటే నే కళ్ళారా చూశాను. ఏం దృశ్యం? ఏం సన్నివేశం? నా మనస్సు వికలమైంది; గుండె బ్రద్దలైంది; మనస్సు విరిగిపోయింది. ఆవేశంతో అదిరిపోయాను.

"మన యిద్దరికి పడదని మీకు తెలుసు. మనం ఎట్లాగూ సుఖరిగావుండలేము. మీ జీవితం పాడు చేసుకోవద్దు. నా జీవితం పాడుచెయ్యవద్దు. నన్ను ఇంక మీమనస్సులో నుంచి తుడిచివేసుకోండి. భోగం కనకాన్నే పెండ్లి చేసుకుని సుఖపడండి. మీయిల్లు బాగు పడుతుంది. మీతల్లిదండ్రులు సంతోషిస్తారు" అని కుండబ్రద్దలు కొట్టినట్లు మనసులో వున్నదంతా ధైర్యంగా చెప్పేసాను. నాకళ్ళు చెమ్మగిల్లాయి.

ఆయనకు త్రాగుడుఅలవాటైనట్లుంది. సారాయి వాసన గప్పుమంది. నేనెంతో ఆవేశంతో అన్నానే గాని, ఆయనలో చాలామార్పు వచ్చినట్లు భ్రమపడ్డాను. ఎర్రగా చింత నిప్పుల్లా మెరుస్తున్న కళ్ళతో నావైపు నిర్ఘాంతపడి చూస్తున్నాడు.

"ఈ నాల్గు సంవత్సరాలనుంచీ నాకు చదివి తెలుసుకొనే టందుకూ ఆలోచించే టందుకూ ఎంతో అవకాశం దొరికింది. నీకిష్టంలేకుండానే నాకు నీమీదవుండే ప్రేమకొద్దీ నిన్ను పెళ్ళిచేసుకుని నీకెంతో ద్రోహంచేసాను. కాని నిన్ను నేనంతగా ప్రేమిస్తున్నానని నీవు అనుకోవు. ఇప్పుడు నువ్వునన్ను మళ్ళీపెండ్లి చేసుకోమంటున్నావు. సరేకాని దానివల్ల నేను సుఖపడతాననే నమ్మకం ఏమిటి? నీకు సుఖంలేకపోతే నాకేం సుఖం? నీవు అట్లా ఎప్పుడూ అనుకోవద్దు సుమా!" అంటూ దీనంగా మనస్సు కరిగేలా ప్రార్థించాడు.

అతనన్నమాటలన్నీ నేనెంత

(మిగతా 56 వ పేజీలో)

# మహోదయం

శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి

అలనాడిందుకళాకలాపముల బౌద్ధారామ సిద్ధార్థముల్
తలముక్కల్ పచరించెనా ? తెలుగు సెల్లాల్ నింగి నీలాలతో
తెలి పుల్గుం గమితో వివాదపడెనా ? దివ్యాపగా భంగముల్
తలలం దాల్చినవా తెనుంగు జయగీతల్, దేశి సంగీతముల్ ? :

చూడలేవా, పదమూడువందలయేండ్ల - నాటి మున్నటి తెన్గునాటిధాటి.
వినజాలవా, వేనవేలేండ్లుగ సముద్ర-ముల ముద్రవేసిన తెలుగుకీవి,
తెలియనేరవ, తెన్గువెలుగు ప్రాగ్దేశాల - కరుణరేఖల దీర్చినట్టి చరిత.
తలపోయనోపవా, తెలుగు శిల్పప్రౌఢి - గ్రీసు పొంతల వెలింగిన ఉదంత.

మది ఒకానొక స్వప్నగతానుభూతి
కాదు కాదు; తెనుంగు రక్తమున గలిసి,
తెనుగుబిడ్డకు సంక్రమించిన సమస్త,
మది తెనుంగు కన్గొన జిగాల్మను మెరుంగు !

ఆ పూర్వాంధ్రుల సంప్రదాయములలో ఆ పూర్వ మర్యాదలో,
ఆ పూర్వ ప్రగతి ప్రమేయములలో ఆ పూర్వ శిల్పమ్ములో
నీ పూర్వమ్మును పుణ్యమున్ గలదుగానీ, నేటి విచ్ఛిన్నక
వ్యాపారమ్ముల నీ తెనుంగు దనమున్ వంచించి దుంచించెడిన్ -

* * *

తడియూరి విరుపుదోచెడి నాల్కపై రస-గుల్లాలె కానోపు కొమరుసూపు.
దరిలేని కరువులో పరువువోయిన కంట-విస్కీయె కావచ్చు వెలికివచ్చు.
నిరుపేద యెదప్రీలి యొరిగినచోట కా-రా కిల్లి యేనోయి రంగువేయు.
సిమసిమచ్ఛద్మమ్ము సేసెడి చితినుండి-సిగరెట్టెయగు జామ్ము పొగలజిమ్మ,

రాఖ్యతిని యెఖ్యత్రాగు దుర్భర దరిద్ర
మానవులు, రత్నా గర్భా కుమారులైన
వారితో గూడి, వింత సంసారయాత్ర
గడుపుచున్నారు : నీ తెలంగాణలోన—

ఎడతెగనట్టి పస్తులకు నింకిన రక్తముతోడ వీధులం
బడి పొరలాడు మానవ శవమ్ములు, ఘోరతరాహవ స్థలిం

బడిన శవాల సోదరులనందగు; ముందుయుగాల మేలుకై
తొడరిన శౌర్యధైర్య మహితుల్ గద ! ఆ దొరలాడు పీనుగుల్ -

ఆ మరణ శయ్యనున్న వీరాధి వీరు
లీ జగత్తున్నచో విస్మరింపబడరు;
దొంగ దోపిడిగాంధ్ర ఈ దుండగములు
ఎన్నటికినైన గాని క్షమింపబడవు !

ఆలుబిడ్డలు గంజికల్లాడి యల్లాడి - కనలి కూలిన, గేస్తు కంటినీరు;
ఒకబిడ్డ తిండికై, ఒకబిడ్డ పాలకై - పనవి వ్రాలిన, తల్లి కనుల నీరు;
ఒకయింత రొట్టెముక్కకు పవిత్ర స్త్రీత్వ-ముడిగిన,గృహిణి కన్నీరలు నీరు;
పూటగంజికి పేట పేట జుట్టిన, నాల్క - తడిగాని వాని కన్ దడియు నీరు:

నేను సామాన్యములుగా గణింపలేను;
ఇవి వృథాపోవు; ముందు ముందెగచి లేచి
అగ్నిపర్వత శిఖర విర్యాత ప్రజ్వ
లచ్ఛిలాద్రవ మట్లు పెల్లడర గలవు !

* * *

ప్రాగ్దిశాంగణమ్ము బంగారు మోముపై
రక్త రేఖ లెగచి క్రమ్ముకొవియె;
గాఢ నిద్రమువిగి కనుమూసిన జగత్తు
కనులు బ్రమయ మేలుకొంచి, లేచె ! -

బ్రహ్మపుత్రా హిమ వాః ప్రపూరమ్ములో - క్రొవ్వేడి యూట త్రొక్కుళ్ళ దోగి,
గంగా గభీర తరంగ భంగిమలలో - తాండవ శ్రీ ధణంధణలు మొరసి,
గోదావరీ శీతలోద గర్భమ్ములో - రాజాంశ నగ్నిపర్వతము రగిలి,
విరియబోసిన కృష్ణవేణి పాయలలోన-'లావా' ప్రవాహముల్ బయలుదేరి,

ఒక మహానటు దొక్క లయోగ్ర వేళ
నుత్సహించి కాల్కదుపు మహోద్యమమున
కీ ప్రకృతి కొల్లుకూటమై, కొప్రమై, మ
హా ప్రథన భూమియై దిక్కులావరించు.

తెలుగు కలాలు దీరిచిన తేనియలూరు పొలాల, తెల్గు క
త్తులు మిరుమిట్లు గొల్పిన ప్రదోష విదూర విద్యుత్తలాల, నీ
కలిమియు బల్మియున్ నిలుపు గన్నవి; గెల్పును గొన్నవి; ఆ మహో
జ్జ్వలత దలంచి ఐక్యమహదాంధ్ర జయధ్వజ మెత్తరా ! ఇకన్ -

# సోవియట్ రచయిత బాధ్యత

— ఎ. ఎ. ఝుడనోవ్ —

ప్రజా జీవితంలోని కష్ట నిష్ఠురాల నుంచి కళ ఎప్పుడూ తప్పించుకోలేదు. "బెలిన్‌స్కీ," 'గొగేలుకు' వ్రాసిన లేఖ చూడండి. సాహిత్యంయొక్క సాంఘిక ప్రాముఖ్యాన్నిగూర్చి అంత బలంగా వ్రాసిన డొబ్రులుబోవ్ విమర్శావ్యాసాలు చూడండి. మన రష్యన్ ప్రజాస్వామిక విప్లవ రచనలన్నీ 'జారిజం' మీద ద్వేషాన్ని పురిగొల్పాయి; ప్రజల ప్రాథమికహక్కులకోసం, ప్రజల విద్యకోసం, ప్రజా సంస్కృతికోసం, జారుప్రభుత్వపు ఇనుప సంకెళ్ళనుండి ప్రజాస్వాతంత్ర్యం కోసం మహత్తరమైన పోరాట వాతావరణాన్ని సృష్టించాయి. కళ, వీరోచితంగా, ప్రజల ఉత్తమాశయాలకోసం పోరాడేదిగా ఉండాలని రష్యన్ సాహిత్యవేత్తల అభిప్రాయం. ఊహావాదులైన సోషలిస్టులకంటె చెర్నిషేవిస్కీ శాస్త్రీయమైన సోషలిజానికి చాలా సన్నిహితుడు. ఆయన తన రచనల్లో వర్గ పోరాట దృక్పధాన్ని ప్రదర్శించాడని లెనిన్‌కూడా పేర్కొన్నాడు. కళకు ఉండవలసిన లక్ష్యాన్ని గూర్చి ఆయన దృక్పధమేమిటో చూడండి. కళ, జీవితానుభూతిని చిత్రించడం మాత్రమేకాక వివిధ సాంఘిక విధానాలను ఖచితంగా అంచనావేకట్టే విమర్శాదృష్టిని ప్రజలకు, అందజేయాలని చెర్నిషేవిస్కీ చెప్పాడు. సాహిత్యపు పోకడలనుబట్టి జీవితం వుండదనీ. జీవితప్రయోజనాలను బట్టే సాహిత్యం వుండాలనీ, డొబ్రులుబోవ్. అన్నాడు. కళకు వాస్తవికతే పునాదిఅనీ. నిర్మాణశక్తికి అదే మూలకందమనీ. సాంఘిక చైతన్యాన్ని దిద్ది తీర్చేది కళ కాబట్టి, కళకు సాంఘిక జీవితంలో ప్రధానపాత్ర వున్నదనీ ఆయన నమ్మకం. అందుకే వాస్తవికతను గూర్చీ. సాహిత్యం యొక్క జాతీయ ప్రకృతినిగూర్చీ, ఆయన నిరంతరం ప్రచారం చేశాడు.

సాహిత్యం సంఘానికి సేవచెయ్యాలనీ, అతి ప్రధానములైన అప్పటి ప్రజా సమస్యలకు పరిష్కారమార్గం చూపాలనీ. అప్పటి భావాలకు అనుగుణంగా వుండాలనీ డొబ్రులుబోవ్ అభిప్రాయం. బెలిన్‌స్కీ, చెర్నిషేవిస్కీ, డొబ్రులుబోవ్‌ల ఉత్తమ సంప్రదాయాల ననుసరించి పెంపొందిన మార్క్సిస్టు సాహిత్య దృక్పధం, వాస్తవికమైన సాంఘిక ప్రయోజనం గల కళనే ఎల్లప్పుడూ సమర్ధిస్తుంది. కళాసాహిత్యాలను గురించిన ఆదర్శవాదుల అశాస్త్రీయ దృక్పథాన్ని "ప్లెఖనోవ్" ఖండించాడు; ప్రజాసేవలో సాహిత్యం ఒక శక్తివంతమైన సాధనమని చెప్పిన రష్యన్ విప్లవ ప్రజాతంత్రవాదుల ప్రధాన సిద్ధాంతాన్ని సమర్థించాడు.

రష్యన్ విజ్ఞానవేత్తల చరిత్రలో 1907-17 మధ్యకాలం కేవలం సిగ్గు చేటుగా ప్రతిభా శూన్యమైందని 'గోర్కీ' అన్నాడు. 1905 విప్లవానంతరం, కొందరు మేధావులు విప్లవపంథాను తిరస్కరించి, అసభ్యమైన అయోమయ రచనలకుదిగి, భావ స్వాతంత్ర్యంపేరిట పెద్దపెద్ద మాటలతో "నేను పూజించిన ప్రతిదాన్నీ తగులబెట్టుకున్నాను. ఇప్పుడు తగులబెట్టిన ప్రతిదాన్నీ పూజించుకొంటున్నా" ననేరకం వ్రాతలకుపాల్పడ్డారు. 'రాప్షిన్' వ్రాసిన 'ది పేల్ హార్స్', విప్లవోద్యమాన్ని వదలి అభివృద్ధి నిరోధకులతో చేరి రష్యన్ ప్రజల ఉత్తమాదర్శాలను, రూపుమాపాలని ఆదుర్దాపడ్డ 'విన్ షెంకో' మొదలైన వారి రచనలూ - ఇలాంటి విద్రోహ సాహిత్యమంతా ఈదశాబ్దంలోనే వచ్చింది. ఇందులో, సాంకేతిక వాదులూ, ఛాయావాదులూ - ఇంకా ప్రజలను త్రోసిపుచ్చి 'కళకళకోసమే'నని సాహిత్యంలో భావ స్వాతంత్ర్యం పేరిట చెలామణి అయి, వస్తువులేకుండా శిల్పంలో నగిషీలుచెక్కుతూ, వైజ్ఞానికంగాను, నైతికంగాను, తమపతనాన్ని ప్రదర్శించుకొన్న అన్నిరకాల అభాగ్యులూ వున్నారు, శ్రామికవిప్లవం ముందువస్తున్నదన్న చావుభయంతో వీరంతా ఏకమైనారు. ఈ అభివృద్ధినిరోధక సాహిత్య ధోరణుల్లోని ఒక ప్రఖ్యాత 'తత్వవేత్త' 'మెరెజ్ కోవిస్కీ'ని చూస్తేచాలు, వీళ్ళందరిసంగతీ తెలుస్తుంది. అతను రానున్న శ్రామిక విప్లవం పెద్ద 'మహమ్మారి' వంటిది అన్నాడు. అక్టోబరు విప్లవాన్ని చూసి పిచ్చెత్తిపోయి చిందులు తొక్కాడు.

ఈ అభివృద్ధి నిరోధకకూటం ప్రతినిధుల్లో "అన్నా అఖ్మటోవా" ఒకతె. సాంకేతికవాదుల్లోంచి తయారైన అక్మీస్టులముఠాలో ఆమె ఒకతె. సోవియట్ సాహిత్యానికి పూర్తిగా విజాతీయమైన, అసభ్యమైన, అర్థరహితమైన, ఉన్నత వర్గాల ఊకదంపుడు కవిత్వంలో ఆమెది పెట్టింది పేరు. అక్మీస్టులు కళలో కేవలం వ్యక్తిగత ధోరణినే ప్రదర్శించారు. 'కళ కళకోస'మనీ, 'సౌందర్యం సౌందర్యం' కోసమనీ, ప్రబోధాలు చేశారు. ప్రజలూ, ప్రజల అవసరాలూ ప్రజా ప్రయోజనాలూ, సాంఘికజీవితం-ఇలాంటి సమస్యలేవీ వాళ్ళకు పట్టలేదు.

ఈ తత్వానికి పునాది 1907 - 17 నాటి నిరంకుశ పెట్టుబడిదారీ సాహిత్య ధోరణుల్లోనే వుంది. ఉన్నతవర్గాల యొక్క, పెట్టుబడిదార్ల యొక్క అంత్య దినాలు సమీపిస్తున్న ఆ రోజుల్లో ఆ పాలకవర్గాల తత్వవేత్తలు తమకు ఇష్టంలేని వాస్తవిక జీవితంనుంచి తప్పుకొని, అయోమయ వేదాంతాల లోతుపాతుల్లోనో, అల్పమైన వ్యక్తిగతానుభూతుల్లోనో, ఆత్మవిచారంలోనో తలదాచుకోవాలని చూశారు. సాంకేతికవాదుల మాదిరిగాను, పతనమైన ఉన్నతవర్గాల తాత్విక దృష్టికి ప్రతినిధులైన తక్కిన అభాగ్యుల్లాగానూ, అక్మీస్టులు కూడా పతనాన్నీ, నిరాశావాదాన్నీ, చచ్చిన తర్వాతి లోకంమీద విశ్వాసాన్ని ప్రబోధిస్తారు.

"అఖ్మటోవా" కవిత్వం ప్రజలనుంచి పూర్తిగా వేరుపడి పోయింది. గతాన్ని

తలచుకొని నిట్టూర్పులు విడవడం తప్పితే, గత్యంతరం లేని పది వేల మంది పై వర్గాల వారిది మాత్రమే ఈ కవిత్వం. కాథరిన్ నాటి రాజభవనాలూ, నందనోద్యానాలు, శిల్పాలూ, చెక్కడాలు, ప్రేమోద్దీపకాలైన నికుంజాలూ.... మందిరద్వారాలనంటి వ్రేలాడే ఆ నగ్న సౌందర్యం....ఆపీటర్స్ బర్గూ, ఒకటేమిటి, ఆ ధనిక సంస్కృతి శేషమంతా మళ్ళీ తలెత్తలేని గతంలో మునిగిపోయింది, ప్రజలకు దూరమై విజాతీయమైన ఆ సంస్కృతి, ఏదో మాయగా నిన్న మొన్నటిదాక నెట్టుకొచ్చింది. కాని, ఈ నాడు ఇంకా ఆ సంస్కృతికి ప్రతినిధులంటూ ఎవరన్నా వుంటే, వారు తమచుట్టూ ఉన్న ప్రపంచాన్ని వదిలిపెట్టి, తమలో తాము ముడుచుకుపోయి, వెర్రి భ్రమతలు పెట్టుకు బ్రతకవలసిందే కాని, గత్యంతరం లేదు. "అంతా వంచనపాలై అమ్ముడుపోయిం"దని అఖ్మటోవా ఆక్రోశం.

విప్లవానికి కొద్దిరోజుల పూర్వం ఆక్మీస్టుల్లో ముఖ్యుడైన 'ఆసిఫ్ మాండల్స్టాం' తమ ముఠా సాంఘిక-రాజకీయ, సాహిత్య దృక్పథాలను వివరిస్తూ ఇలా వ్రాశాడు :

"మధ్య యుగాలనాటి ప్రతిభా విశేషమూ, అప్పటివారికి రాజ్యాంగముమీదా రాజ్యాంగ యంత్రంమీద వున్న ప్రేమా, ఆక్మీస్టులకుకూడా వున్నాయి.... మధ్యయుగం మానవ ప్రకృతిని నిర్వచించింది; వ్యక్తిగత గుణాగుణాలు అలా వుంచి, ఆ ప్రకృతిని ప్రతి మానవునిలోను దర్శించి మన్నించింది.... యూరోపు పొందిన చక్కని సంస్కృతీ సంప్రదాయంలో స్వచ్ఛమయిన, నిరలంకారమయిన, వ్యక్తిగత జీవితం స్వయం పూర్ణంగా గౌరవించబడింది. అందువల్లనే విప్లవానికి చెందిన 'సమానత్వ సౌభ్రాతృత్వ' దృక్పథానికి విభిన్నమైన ఉన్నత వర్గాల ఆత్మీయతే మాస్నేహబంధం ....అంతరువులనూ, కులాల తారతమ్యాలనూ అత్యున్నత స్థాయికి తీసుకుపోయిన మధ్య యుగాలంటే మాకు చాలా ఇష్టం .... అధిభౌతిక, హేతువాదాల మేలి కలయికా, జగత్తంతా ఒక సజీవ సామరస్యమనే ప్రాపంచిక దృష్టి, మమ్మల్ని మధ్య యుగాలకు సన్నిహితం చేశాయి. 1200 ప్రాంతంనాటి భావకవిత్వం మాకు బలాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తున్నది."

"మాండల్స్టాం" చెప్పినఈమాటల్లో ఆక్మీస్టుల ఆశయాదర్శాలేమిటో తేలిపోతుంది. 'మధ్యయుగాలకు తిరగండి' అనేదే ఈముఠాయొక్క సాంఘికాదర్శం కనుక, 'జోషెంకో' ఇటీవలి రచనలుఏదో అకస్మాత్తుగా వచ్చినవికావు. 1920 నాటి అతని సాహితీ సంప్రదాయంనుంచే ఈ రచనలు పుట్టుకొచ్చాయి. అయితే జోషెంకో పుట్టుపూర్వోత్తరాలు ఏమిటి? "సెరేపియన్ బ్రదర్స్" అనే ఒకరచయిత లకూటాన్ని నిర్మించిన వాళ్ళలో ఇతనొకడు. ఈకూటం పెట్టిననాటి జోషెంకో సాంఘిక రాజకీయ దృక్పథం ఏమిటో చూద్దాం. ఈ ముఠావాళ్ళ

"లిటరేచర్న యా జాపిస్కీ" (సంచిక 3,1922) లో తమ వాదాన్ని వివరించారు. మిగతా తెలుపులన్నీ అలా వుంచి, తననుగురించీ, తక్కిన కొన్నిటినిగూర్చీ జోషెంకో ఏమి వ్రాసాడో చూడండి. సిగ్గయినాలేకుండా, నగ్నంగా జోషెంకో తనరాజకీయ సాహిత్య దృక్పధాలను బట్టబయలు చేసుకున్నాడు. అతనువ్రాసుకున్న మాటలుఇవి: "అసలు రచయిత కావడమేకష్టం. ఇక ఇప్పుడు రచయితకొక సిద్ధాంతంకూడా వుండాలి. ఎంత నగుబాటుపని! ఏఒక్క పార్టీకూడా నన్ను పూర్తిగా ఆకర్షించలేకపోయినప్పుడు, నాకు ఒక స్పష్టమైన సిద్ధాంతంఎలావుంటుందో మీరేచెప్పండి. పార్టీ అనుచరుల దృష్టిలో నేను నీతినియమాలు లేనివాణ్ణి. నావరకు నేను చెప్పాలంటే - నేను కమ్యూనిస్టునూ కాను; సాంఘిక విప్లవవాదినీకాను; నిరంకుశవాదినీకాను — కేవలం రష్యావాణ్ణి మాత్రమే. ఇక రాజకీయాలతో నాకు ప్రమేయంలేదు. నామాట నమ్మితే, 'గొచ్‌కోవ్' ఏపార్టీకి చెందుతాడో నాకు తెలియదు, దేవుడికి తెలియాలి! నాకు తెలిసినంతవరకు మాత్రం, అతను బోల్షివిక్‌కాడు; సాంఘికవిప్లవవాదో, ప్రజాస్వామిక మితవాదో నాకు తెలియదు, తెలుసుకోవాలని కూడా లేదు."

ఈ జోషెంకో సిద్ధాంతానికి మీరేం చెబుతారు?

అదే పత్రికలో 'లెవ్‌లుంట్జు' అనే మరొక జోషెంకో సహపాఠి, తమ వినాశకర విధానాన్ని సమర్ధించుకుంటూ ఏమి వ్రాశాడో కూడా వుదాహరిస్తాను.

"అతిభయంకరమైన విప్లవ వాతావరణంలో మనం కల్లుసుకున్నాం. 'మాతో లేనివాళ్లు మాకు శత్రువు' అనే మాటలు మనకు రెండుపక్షాల నుంచీ వినిపిస్తున్నాయి. అయితే 'సెరేపియన్ బ్రదర్స్' (మనం) ఎవరిపక్షం? మనం కమ్యూనిస్టుల పక్షమా? లేక వారికి వ్యతిరేకమా? మనం విప్లవానికి అనుకూలురమా? ప్రతికూలురమా? మనం ఎవర్ని అనుసరిస్తాం? అని అంటే, మనం అనుసరించేది సెరేపియన్‌మహర్షిని. ఇప్పటికే రష్యన్ సాహిత్యంలో సాంఘిక దృక్పధం ఎడతెగకుండా, పీడాకరమైపోయింది. మనం ప్రయోజన వాదానికి వ్యతిరేకం. మనం ప్రచారంకోసం వ్రాయడం లేదు. జీవితంలాగానే కళకూడా నిజమైంది. జీవితంలాగానే ,కళకూడా, హేతుహేతుమద్భావాలతోనిమిత్తంలేకుండా జీవిస్తుంది జీవించడంకంటె గత్యంతరంలేదు కనుకనే కళ జీవిస్తుంది. కళకు తాత్విక సాంఘిక ప్రాముఖ్యం ఏమీ లేదనీ, కళ నిర్నిబంధంగా ఒక హేతువూ ప్రయోజనమూ లేకుండా వుండాలనీ, 'కళ కళకోసమే'ననీ 'సేరేపియన్ బ్రదర్సు' దృక్పథం."

మనకు పూర్తిగా విజాతీయమైన ఇలాంటి పతిత సాహిత్య ధోరణులకు మనమెందుకు స్థానం కల్పించాలి? అక్మిస్టులూ, సాంకేతికవాదులూ, తదితర అభివృద్ధినిరోధకులూ - రష్యన్ సాహిత్యపు విప్లవ ప్రజాస్వామిక సంప్రదా

యాలమీద ధ్వాడి సాగించాలనీ, మన సాహిత్యంయొక్క తాత్విక సాంఘిక ప్రాముఖ్యాన్ని త్రోసిపుచ్చాలనీ, సాహిత్యాన్ని భావశూన్యమైన బూతుకూతల రొంపిలోకి ఈడవాలనీ యెన్నిసార్లో ప్రయత్నించారు. రష్యన్ వాఙ్మయ చరిత్రే దీనికి నిదర్శనం. పాషన్ల క్రింద తేలిన ఈ ప్రయత్నాలన్నీ వీటి అండనున్న వర్గాలతోపాటు గతంలోకి అంతర్ధానమైపోయాయి. ప్రపంచంలో యేదీ అభివృద్ధిచెందరాదనీ, దేనిమీదా విమర్శ పనికిరాదనీ అక్మీస్టులు ఉద్ఘాటించారు. అభివృద్ధిచెందుతున్న జీవితంమీద వాళ్ళకీ వైముఖ్యం దేనికి? దీనికి కారణం ఒకటే వుంది - తమ ఉన్నత వర్గాల ఉనికి వాళ్ళ కిష్టం; ఆ ఉన్నతవర్గాలను విప్లవ ప్రజానీకం కూలద్రోయబోతున్నది. 1917 ఆక్టోబరులో ఈ పరిపాలకవర్గాలూ, వాళ్ళతోకలూ, అందరూ ఒక్కసారిగా అణగారిపోయారు. మళ్ళీ యిప్పుడు సోషలిస్టు విప్లవం తరువాత ఇరవైతొమ్మిదేళ్ళకు ఎలా జీవించాలో మన యువకులకు నేర్పడానికి ఆ ఛాయా ప్రపంచంలోనుంచి కొంతమంది వింత జంతువులు తలెత్తుతున్నారు.

దుఃఖాన్నీ, హృదయ దౌర్బల్యాన్నీ, నిస్పృహనూ, సాంఘిక జీవితంలోని ప్రధాన సమస్యలనుంచి తప్పించుకోవాలనే కోరికనూ, వీళ్ళ రచనలు ప్రచారం చేస్తాయి: వ్యక్తిని సాంఘిక జీవితపథం నుంచీ, కార్యాచరణనుంచీ దూరంచేసి కూపస్థమండూకంలా తన వ్యక్తిగతానుభవాల ఆవరణలో ముడుచుకుపోయేటట్లు చేస్తాయి.

ఇలాంటి భావాలను పురికొల్పే రచనలు మన యువకుల మీద దుష్ప్రభావాన్ని విరజిమ్మి, రాజకీయంగాను, సాంఘికంగాను, తాటస్థ్య మనే పతిత దృష్టితోను, బాధ్యతారాహిత్యంతోనువారికి విషంపోస్తాయని వేరేచెప్పనక్కర లేదు. మనం మన యువకులకు బాధ్యతారాహిత్యాన్నీ, ఆశయం మీది అ విశ్వాసాన్నీ ప్రబోధించి వున్నట్లయితే ఏమి జరిగి వుండేదో ఆలోచించండి. ఈ మధ్యనే ముగిసిన మహా యుద్ధంలో మనకు అపజయం చేకూరి వుండేది. సోవియట్ సాహిత్య సహాయంతో మన రాజ్యాంగమూ, మన పార్టీ యువకుల్లో ధైర్యాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ పురికొల్పాయి కనుకనే, సామ్య వాద నిర్మాణంలో వచ్చిన కష్టాల నన్నిటినీ ఎదుర్కో గలిగాం; జర్మన్ జపాన్ ఫాసిస్టులను ఓడించ గలిగాం.

సాంఘిక పరిణామంలో మన సాహిత్యానికున్న మహత్తర ప్రభావాన్ని లెనినిజం గుర్తిస్తుంది. ఇలాంటి మన సోవియట్ సాహిత్యం తన ఉత్తమ కర్తవ్యంనుంచి దిగజారి పోవడమంటే మనం తిరుగు ముఖం పట్టామన్న మాట, శిలాయుగానికి తిరోగ మిస్తున్నామన్న మాట!

"రచయితలు మానవ హృదయ నిర్మాత"లని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు. ఈ నిర్వచనంలో గంభీరమైన అర్థం ఇమిడివుంది. సోవియట్ ప్రజలకూ, యువకులకూ విజ్ఞానాన్ని పంచడంలో రచయితలకున్న మహత్తర బాధ్యతలను ఈదృక్పథమే వ్యక్తపరుస్తుంది. ఇక్కడ

చౌకపారు సాహిత్యాన్ని ఎంతమాత్రం సహించడానికి వీలులేదు.

సాహిత్య విషయాల్లో కేంద్రకమిటీ ఇంత తీవ్రమైన చర్య తీసుకోవడం కొందరికి విపరీతంగా కన్పిస్తుంది. ఇది సామాన్యంగా జరిగేదికాదు. ఏ పరిశ్రమలోనన్నా, ఏ వస్తూత్పత్తిలోనన్నా లోటుపాట్లు జరిగితే, వాటికి బాధ్యులైన వాళ్ళను తీవ్రంగా విమర్శించడం సహజమేనని ప్రజలకు తెలుసు. మానవ హృదయాలకు వికాసం కలిగించడం లోను, యువకులకు విద్యాప్రబోధం చెయ్యడంలోను చెత్తకు అవకాశమిస్తే సహిస్తారా? నిజానికి ఇది ఏ ఒక పరిశ్రమనో విచ్ఛిన్నం చేసేకంటేనూ, ఏ ఒక వస్తూత్పత్తినో పూర్తి చెయ్యకపోవడం కంటేనూ తీవ్రమైన నేరంకాదా? వివిధ జీవిత రంగాలతోపాటుగా, మన వైజ్ఞానిక రంగాన్నికూడా సమానస్థాయికి తీసుకురావాలనే కేంద్ర కమిటీ తీర్మానం లోని ఉద్దేశం.

మన ఉద్యమాలయొక్క ఉన్నత స్థాయిని నిలబెట్టుకోవాలన్నా, ఉద్యమ నిర్వాహకులకు విజ్ఞానం వికాసం కలిగించాలన్నా, మనం కొందరిని నొప్పించవలసి వస్తుందని భయపడగూడదు. ప్రధానసూత్రాలమీద ఆధారపడి సూటిగా బహిరంగంగా విమర్శించడానికి కూడా జంకగూడదు. విమర్శే లేకపోతే, సాహిత్యసంస్థలుగానీ, మరే సంస్థగానీ చెడిపోతుంది. విమర్శ లేకపోతే ఏరోగమయినా జీర్ణించి శరీరంలోకి చొచ్చుకుపోవచ్చు. అప్పుడు దాని నివారణోపాయము దుష్కరమవుతుంది. నిర్భయమైన బహిరంగవిమర్శే మన ప్రజల అభివృద్ధికి తోడ్పడుతుంది. వారిలో అభ్యుదయకాంక్షను రేకెత్తిస్తుంది. వారి లోటుపాట్లను వారు సరిదిద్దుకొనేట్లు చేస్తుంది. ఎక్కడైతే విమర్శన వుండదో, అక్కడ అవినీతి స్తబ్దతా గూడుకట్టుకొని అభ్యుదయం నశిస్తుంది.

ప్రతి సోవియట్ పౌరుడూ తాను రోజూ చేసిన కార్యక్రమంయొక్క ఫలితాలను సమీక్షించుకొని, తన్నుతాను దిద్దుకొని తన లోటుపాట్లనూ, తప్పులనూ ధైర్యంగా విమర్శించుకొని తన కార్యక్రమం ఇంకా ఫలవంతం కావడానికి మార్గాలు ఆలోచించుకొని నిరంతరం తన అభివృద్ధికోసం కృషి చెయ్యాలని కామ్రేడ్ స్టాలిన్ ఎన్నిమాట్లో స్పష్టపరిచాడు. ఇది తక్కిన ప్రజలందరికిలాగానే రచయితలకుకూడా వర్తిస్తుంది. తమ కార్యక్రమంమీది విమర్శకు భయపడే వాళ్ళు ప్రజల ఆదరానికి అనర్హులైన పిరికి పందలు.

నిర్మాణ కార్యక్రమ నిర్వహణంలో తమకు కావలసిన ఆత్మబలాన్నీ, తాత్విక శక్తినీ రచయితలు సమకూర్చాలని సోవియట్ ప్రజలు ఎదురుచూస్తున్నారు. సోవియట్ ప్రజలు తమ రచయితలను గొప్ప కోరికలు కోరుతున్నారు; తమ తాత్విక వైజ్ఞానికావసరాలు రచయితలే తీర్చాలని వారి కోరిక.

యుద్ధం జరుగుతున్నన్నాళ్లూ, ఆ యుద్ధ పరిస్థితుల్లో ప్రజల వైజ్ఞానికావసరాలు తీర్చలేకపోయాం. ప్రస్తుతం జరుగుతున్న సంఘటనలను అర్థం చేసుకోవాలని ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.

తాత్వికంగాను. వైజ్ఞానికంగాను కూడా మన ప్రజల స్థాయి పెరిగింది. తరచుగా ఇప్పుడు మనదేశంలో వస్తున్న కళాసాహిత్యాలతో వారు సంతృప్తి పడడంలేదు కాని. కొందరు విజ్ఞాన వేత్తలూ, తాత్వికులూ ఈ సత్యాన్ని గమనించలేదు: గమనించ దలచుకో లేదు కూడా.

మన ప్రజల అభిరుచీ వారికోర్కెలూ చాలా పెంపొందాయి. ఈ స్థాయిని అందుకోలేనివాళ్లు వెనుక బడిపోతారు. సాహిత్యం ప్రజల కోర్కెలకు అనుగుణంగా ఉన్నంతమాత్రాన చాలదు: సాహిత్యం ప్రజల అభిరుచినీ కోర్కెలనూ పెంపొందించాలి. వారిలో నూతన భావాలను రేకెత్తించి, వారిని ముందుకు నడపాలి ప్రజలతోపాటు ముందడుగు వేయలేక, వారి కోర్కెలను సంతృప్తి పరచలేక, సోవియట్ సంస్కృతీ బాధ్యతలను నిర్వహించలేనివాళ్లు తప్పకుండా అధోగతికి పోతారు.

వైజ్ఞానిక రంగంలోని కర్తవ్యాన్ని ఎప్పుడూ విస్మరించగూడదు. మన ప్రజలకు భౌతికసంపద ఎంత ప్రధానమైనదో వైజ్ఞానిక సంపదకూడా అంతే. భౌతిక జీవితంలో లాగానే, వైజ్ఞానికజీవితంలో కూడా, కళ్లుమూసుకొని ముందు చూడకుండా జీవించడ మనేది అసాధ్యం. సోవియట్ ప్రజలు వైజ్ఞానికంగా ముందున్నారు. ఏచెత్తపడితే అది చదివి సంతోషించరు. తమ్ము తాము సరితూచుకొని, ప్రజలకోర్కెలను తీర్చలేకపోతే, మన కళాకారులూ, సాహితీపరులూ త్వరలో వారి విశ్వాసాన్ని కోల్పోతారు.

మన సోవియట్ సాహిత్యం ప్రజాశ్రేయస్సునూ, దేశ శ్రేయస్సునూ దృష్టిలో పెట్టుకుంది; పెట్టుకొనితీరాలి కూడా. సాహిత్యం ప్రజలకు ప్రియమైనది; అందువల్లనే ప్రతి ఉత్తమ సాహిత్య గ్రంథమూ తమదిగా భావించి ప్రజలాదరిస్తారు. అందువల్లనే విజయవంతమైన ప్రతి గ్రంథాన్నీ, విజయవంతమైన యే యుద్ధంతోనైనా. లేక ఏ ఆర్థిక విజయంతోనైనా సరిపోల్చవచ్చు. కాని సోవియట్ ప్రజల్నీ, పార్టీనీ, దేశాన్నీ కించపరచే సాహిత్యం ప్రజల ఆగ్రహానికి పాత్రమవుతుంది. ఇదే కేంద్రకమిటీ దృష్టిలో ఉంది. ప్రజా శ్రేయస్సును గురించీ, ప్రజా సాహిత్య శ్రేయస్సును గురించీ కేంద్ర కమిటీ బాధ్యత వహిస్తుంది.

మీరు వైజ్ఞానిక రంగంలో ప్రథమ శ్రేణిలో వున్నారు. అంతర్జాతీయ ప్రాముఖ్యంగల అనేక సమస్యలను మీరు ఎదుర్కొంటున్నారు. దీన్నిబట్టే తన ప్రజలపట్ల, దేశంపట్ల, పార్టీపట్ల తనకున్న బాధ్యతను నిజమైన ప్రతి రచయితా గట్టిగా గుర్తుపెట్టుకోవాలి; అన్నిటికంటె, రచయితగా తన ప్రధాన కర్తవ్యాన్ని గమనించాలి. జాతీయంగాను అంతర్జాతీయంగాను మనం సాధించిన విజయాలంటే బూర్జువాజగత్తుకు ఇష్టం లేదు. కాని, రెండవ ప్రపంచయుద్ధం సామ్యవాదంయొక్క ఉనికిని దిట్టపరచింది. ఇవాళ యూరోపులోని అనేక దేశాల్లో సామ్యవాదం ప్రధానస్థానం వహిస్తున్నది. ఇది సామ్రాజ్యవాదులకు ఇష్టంకాదు. సామ్యవాదమంటేనే వాళ్ళకు

హదలు. అభ్యుదయం చెందుతున్న మానవ జాతికంతటికీ ఆదర్శప్రాయంగా వున్న మనసోషలిస్టు దేశమంటేవాళ్ళకు భయం. కనుక, సామ్రాజ్యవాదులూ, వాళ్ళ బంట్లూ, వాళ్ళ మోచేతి నీళ్ళకు వాచిపోయిన రచయితలూ, విజ్ఞాన వేత్తలూ, రాజనీతిజ్ఞులూ మనదేశంమీద ఇంత దుమ్ముకొట్టి, అపోహలు వ్యాపింపజేసి, సామ్యవాదాన్ని తిట్టిపొయ్యడానికి శాయ శక్తులా ప్రయత్నిస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో సోవియట్ సాహిత్యంయొక్క కర్తవ్యం - దెబ్బకు దెబ్బ కొట్టి, సోవియట్ సంస్కృతిమీద సామ్యవాదంమీద వాళ్ళు సాగించే దాడులను ఎదుర్కోడం మాత్రమేకాదు: పతనమై దిగజారి పోతున్న బూర్జువా సంస్కృతిని నిర్దాక్షిణ్యంగా ఎదుర్కొని ఖండించాలి.

పశ్చిమ యూరప్‌లోని అమెరికాలోని నవీన బూర్జువా రచయితల, ఫిలిం నిర్మాతల పైపైశిల్పం ఎంత అందంగా కనిపించినా, అసలు నైతిక పునాదులే శిధిలమైపోయి, కేవలం పతన దశలో వ్యక్తిగతాస్థినీ బూర్జువా సమాజంలోని ఉన్నత వర్గాల ప్రయోజనాలనూ సమర్థించడం కోసం జీవిస్తున్న బూర్జువా సంస్కృతిని వాళ్ళు కాపాడలేరు ఈ బూర్జువా రచయితలూ, ఫిలిం నిర్మాతలూ, మొత్తం మొత్తం, నేటి సమాజంలోని అభ్యుదయ వర్గాలదృష్టిని ప్రధాన సాంఘిక రాజకీయ సమస్యలనుంచి మరల్చడానికీ; దోపిడీ దొంగలతోను, బజారు స్త్రీలతోను, వ్యభిచార గాధలతోను, దుర్మార్గుల సాహసాలతోను నిండిన చౌకసారు తప్పుడు సాహిత్యంపై పుకు త్రిప్పడానికీ ప్రయత్నిస్తున్నారు.

అభ్యుదయ సోవియట్ సంస్కృతీపరులమూ, సోవియట్ దేశభక్తులమూ అయిన మనం ఇలాంటి బూర్జువా సంస్కృతిని కీర్తించేవారి ధోరణిని అభినందించగలమా? నిస్సంశయంగా బూర్జువా ప్రజాస్వామికం కంటె, అత్యున్నతమైన రాజ్యాంగ విధానాన్నీ, బూర్జువా సంస్కృతి కంటె ఉత్తమోత్తమమైన సంస్కృతినీ ప్రతిపాదించే మన సాహిత్యము తక్కినవాళ్ళకు ఒకానొక వినూతన విశ్వ సందేశాన్ని అందచేసేఅర్హత కలిగివుంది. మన ప్రజలలాంటి ప్రజలూ, మనదేశంవంటి దేశమూ మరెక్కడైనా చూశారా? యుద్ధకాలంలో సోవియట్ ప్రజలు ప్రదర్శించిన వుత్తమ గుణాలూ, యీనాడు శాంతికాలంలో అభ్యుదయం కోసం జాతీయార్థిక స్థితినీ సంస్కృతినీ పునర్నిర్మించుకోడం కోసం సోవియట్ ప్రజలు చూపుతున్న ఉత్తమగుణాలూ, మరే దేశ ప్రజల్లోనైనా కనిపిస్తాయా? ప్రతిక్షణం మన ప్రజలు పురోగమిస్తున్నారు; మనం నిన్న ఉన్నచోట ఇవాళ లేము-రేపు ఇవాళ ఉన్నట్టుకూడా ఉండం-ఇంకా ముందుకుపోతాం. మనం 1917 పూర్వపు రష్యన్లలాగా లేము ఇవాళ. రష్యాకూడా ఆనాటిలాగాలేదు; మన స్వభావంకూడా అప్పటి లాంటిదికాదు. మన దేశాన్ని పూర్తిగా మార్చివేసిన అద్భుత పరిణామాలతోపాటు, మనం కూడా మారిపోయాము; అంతకంతకూ ఉత్తమస్థాయిని అందుకొంటున్నాం.

సోవియట్ ప్రజల్లోని ఈ ఉత్తమ

లక్షణాలను ప్రదర్శించడమూ; సోవియట్ ప్రజలకు వారి ప్రస్తుత జీవితాన్నే కాక, భవిష్యదాశారేఖలు గోచరింపజేయడమూ; వారి పురోగమన మార్గాన్ని విజ్ఞాన తేజఃపుంజంతో సుగమం చేయడమూ - ఇదే చైతన్యంగల ప్రతి సోవియట్ రచయితకూ విధి! రచయిత చారిత్రక సంఘటనలకు వెనుకబడి పోరాదు. ప్రజల్లో ప్రథమశ్రేణిలో నిలిచి ప్రజాభ్యుదయ పథాన ముందు నడవాలి. సోషలిస్టు వాస్తవిక దృక్పథంతో ప్రజా జీవితాన్ని శ్రద్ధగాను, చైతన్యంతోను పరిశీలించి ప్రజాభ్యుదయ రీతుల్లో పూర్తిగా పాల్గొని రచయిత ప్రజలకు వైజ్ఞానికశక్తిని సమకూర్చి వారిని విజ్ఞానవంతులను చెయ్యాలి. సోవియట్ ప్రజల ఉత్తమోత్తమ లక్షణాలను చిత్రిస్తూ, భవిష్యత్తు ఎలా వుంటుందో చూపుతూ, మన ప్రజలు ఎలా ఉండకూడదో కూడా చూపాలి; నేటి సోవియట్ ప్రజాభ్యుదయ పథంలో కంటకప్రాయాలు కాగల పురాతన ఛాందస భావాలనుకూడా తుడిచి పారెయ్యాలి. మన యువకులకు ధైర్యాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ, ఏకష్టాలనైనా ఎదుర్కొనే నిర్భయత్వాన్నీ ప్రబోధించడంలో సోవియట్ రచయితలు ప్రభుత్వానికీ, పార్టీకీ తోడ్పడాలి.

సోవియట్ రాజ్యాంగ వ్యవస్థా, సోవియట్ సంస్కృతి సాధించిన విజయాలను తమ ప్రజలనుంచి మఱ్యపరచడానికీ, సోవియట్ యూనియన్ చుట్టూ ఒక ఉక్కుతెరకట్టి, సోవియట్ లోని వాస్తవ జీవితం తమ ప్రజలకు తెలియకుండా ఉంచడానికీ, సోవియట్ సాంస్కృతికాభ్యుదయాన్ని కించపరచడానికీ – బూర్జువా రాజ్యాంగవేత్తలూ, విజ్ఞానవంతులూ ఎంత ప్రయత్నించినా, అది సాధ్యమయ్యే పనికాదు.

వైజ్ఞానిక రంగంలో పనిచేసే సోవియట్ రచయితలూ ఇతర కళాకారులూ ఇవాళ ప్రథమ శ్రేణిలో వున్నారు. ఈ యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రయత్నాల్లో ముఖ్యంగా రచయితల ప్రాముఖ్యం హెచ్చుతుందే కాని, తగ్గదు. ఇవాళటి జీవితం నుంచి మన సాహిత్యం దూరం కాగూడదనీ, వివిధ జీవిత రంగాలలోనూ పూర్తిగా పాల్గొనాలనీ సోవియట్ ప్రజలూ ప్రభుత్వమూ, పార్టీ- అందరూ కోరుతున్నారు.

[ఇది, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి, ఎ. ఎ. ఝడనోవ్, లెనిన్ గ్రాడ్ రచయితల సమావేశంలో, 1946 సెప్టెంబరు 20 న ఇచ్చిన ఉపన్యాస సారాంశం.]

---

# ఇంకా ఇప్పటికీ

## శ్రీ సోమసుందర్

ఈ లోకపు
చీకటి మూకుడులో
జీవితాలు చిటపటమని
ఇంకా పేలుతునేవున్నవి.
చాలీ చాలని కడుపులు
కరువుల కక్కుర్తులతో,
ఆర్తంగా, ఖిన్నంగా -
క్షోభిస్తూనేవున్నవి!
ఎండిన ఎముకల
అంతరాంతరాహంకృతి,
'నాదే యీ సర్వస్వమ్మని'
మూలుగులో
మూలుగుతూనే ఉన్నది.
నలభై కోట్ల
భారతీయులంతా,
స్వప్నంలో సందర్శించిన
భాగ్యదేవతకి
[పాపం !] - ఇంకా
కవాటాల పహరాలో
బందాలింకా
బందోబస్తయి
కదలక, చెదరక,
నిలచే వున్నవి!
శాంతి మయూఖం
చల్లగ ప్రసరించే
నవయుగ నిర్మాణంలోకూడా,
నలభైకోట్ల జతల కన్నుల
తోరణాలు ఏకాండీగా
చూడా లనుకున్నది
చూచేందుకు
వేచేవున్నవి!
మా యీ మానవాళి
అసంతృప్త హృదయాలన్నీ
స్వాతంత్ర్య సుధా వృష్టికోసం,
ఆ - స్వాతివాన చినుకులకోసం,
కాళీ ముత్తెపుచిప్పలుగా
కాచుకొనే వున్నవి!
సర్వజనావృత
సమైక్య పోరాటానికి
స్వేచ్ఛా సముజ్జ్వల
స్వర్గ స్థాపనకై
ఇంకా,.... ఇప్పటికీ....
తరుణానికి
కనిపెట్టుకునే వున్నవి!
వేవెల్ ప్రభృత
ఏకాక్షీ శ్వేతాంగులు
మాయీ మాతృలోకమున
సంచారం చేస్తూ
కళంకితం చేయక
పైదొలగేందుకు,
ప్రతీకార వాంఛలతో
కసి శంఖమ్మును
పూరిస్తూనేవున్నవి.
మాయీ శుష్క, శల్యావశిష్ట
కంఠమ్ములు కొత్త పిలుపులిస్తూ
'సుగ్రీవ' ప్రతిజ్ఞ
తీసుకొనేవున్నవి.
సర్వ జనాంగీకృత
సమైక్య సమరానికి
ఆ - హోరాహోరీ పోరాటానికి
అహోరాత్రములు
కవాతు చేస్తూనేవున్నవి!
సంసిద్ధంగానే ఉన్నవి!!

# పల్లెపడుచులు

మూలం: చెకోవ్



అనువాదం: హసన్

రైబజ్ అనేవూళ్లో చర్చి కెదురుగానే వున్నది రెండంతస్తులమేడ. క్రింది అంతస్తులో ఇంటి యజమాని 'ఫిలిప్' కుటుంబంతోసహా కాపురముంటున్నాడు. అతన్నే అందరూ, 'తాతా' అని కూడా పిలుస్తూ వుంటారు. వేసవి కాలపు విశ్రాంతికోసం వచ్చే ఆఫీసర్లు, భూస్వాములు, వర్తకులు పైఅంతస్తులో మకాం వేసి పోతూవుంటారు. ఉన్న భూమిని కౌలుకిచ్చేసి వచ్చే ఆదాయంతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. పెద్దబజారులో అతనిదొక హోటలుకూడావుంది. పైగా దూళ్ళవర్తకం చేస్తూవుంటాడు. మొత్తం మీద, వీటన్నింటికీ ఫలితంగాబ్యాంకులో 8వేల రూపాయలనిలవధనం ఏర్పడింది.

అతని పెద్దకొడుకు 'ఫియోడార్' ఫ్యాక్టరీలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఆవూళ్ళో రైతులంతా అతన్ని గూర్చి ఎంతో గొప్పగా చెప్పుకుంటారు. 'ఫియోడార్' భార్య 'సోఫ్యా' మామగారి ఇంట్లోనే ఉంటుంది. ఆమెఎప్పుడూ ఏదోజబ్బుతో మూల్గుతూ, ప్రతీఆదివారం మందుకోసం ఆసుపత్రికి పోతూ వుంటుంది.

రెండో కొడుకు, 'అల్యోష్కా' తండ్రి దగ్గరే వుంటున్నాడు. అతడో గూని మనిషి. వయస్సు ముదిరిన తరువాత పెళ్ళయింది. 'వార్వరా' అతని భార్య. అబ్బాయికి పెన్నాళ్ళకీ ఎవ్వరూ పిల్లనివ్వకుండా వుంటే, ఊళ్ళన్నీ తెగ తిరిగి, ఒక బీద కుటుంబంలోంచి, ఈ అమ్మాయిని కొనుక్కు తెచ్చారు. 'వార్వరా' అందంగా, సౌష్టవంగా వుంటుంది. ఆఫీసర్లు. వర్తకులు, మేడ మీద మకాం వేసినప్పుడు, ఈమెచేతే. ఈపనీ, ఆపనీ, చేయించుకుంటారు. కాఫీ కాచడం, పక్కలు సర్దటం, ఇట్లాంటి పనులన్నీ ఆమెతో చెప్పి చేయించుకోడం వాళ్ళకెంతో సరదా.

ఒకరోజు సాయంత్రం సూర్యుడస్తమిస్తున్నాడు. మోసుకుపోయే గడ్డి మోపుల వాసనతో - ఆ సాయంకాలపు గాలి ఎంతో కమ్మగా వీస్తోంది. పాలు పితుక్కుని రైతులు నెమ్మదిగా ఇళ్ళకి జేరుకుంటున్నారు. అప్పుడే, అందమైన, జట్కాబండి 'ఫిలిప్' గుమ్మంలో ఆగింది. బండిలోంచి ముగ్గురు దిగారు. ఇంచుమించు ముప్పై ఏళ్లుంటాయి. ఖరీదైన దుస్తులు ధరించిన పెద్దమనిషి. ప్రక్కనే నల్లటి కోటు తొడుక్కున్న యెనిమిదేళ్ళకుర్రవాడొకడు, నిలబడ్డారు. బండివాడు గుర్రాన్ని, కొంచెం దూరంగా తోలుకుపోయి మేపుతున్నాడు. బాటసారి కాళ్లూ, చేతులూ కడుక్కొని చర్చి కెదు

రుగా నిలబడి దైవప్రార్థనలో నిమగ్నుడై నాడు. కొంతసేపైనాక బండికి దగ్గరగా, కంబళీ పరుచుకొని అతనూ, ఆ కుర్రాడు భోజనం చేయసాగారు. ఎదురుగా వచ్చి కూర్చున్న 'ఫిలిప్' తో మాట్లాడుతూ బాటసారి నెమ్మదిగా తింటున్నాడు. ఫిలిఫ్ ఆ బాటసారి చేష్టలు చూచి అతడొక మంచి మర్యాదగల వర్తకుడని గ్రహించాడు. ఎందుచేతనంటే, ఫిలిప్ ప్రతియేటా తన యింటికి వచ్చేపోయే, బాటసారుల పరిచయంవల్ల ఎంతో అనుభవం సంపాదించాడు.

బాటసారి ఏ విధంగా మాట్లాడుతాడో అనికనిపెట్టుకుని కూర్చున్నాడు. రాత్రిళ్లు, ఇట్లాంటి బాటసారులతో కథలు చెప్పించుకుంటూ, పడుకునే వేళదాకా ఆనందంగా ఓపికతో వింటూఉంటాడు. భార్య 'ఆఫ్నా సేప్నా' సుమారు తన వయస్సేకల్గివుంటుంది, ఆమెపెద్దకోడలు 'సోఫ్యా' ఇద్దరూ కలిసి దూళ్ల సాలలో పాలు పితుకుతున్నారు. చిన్న కోడలు "వార్వరా" మేడ మైన కిటికీ దగ్గర కూర్చుని. ఏదో చిరు తిండి తింటోంది.

"ఈ అబ్బాయి మీ కుమారుడా?" తాతబాట సారిని ప్రశ్నించాడు.

"కాదు ఏదిక్కూ లేని అనాధుడు. నా ఆత్మ శాంతి కోసం వాణ్ణి నాదగ్గరకు జేరదీసి నేనే పెంచుతున్నాను"

క్రమంగా ఇద్దరూ సంభాషణలోకి దిగారు. ఆబాటసారి మాటలధోరణిచూస్తే విసుగు విరామం లేకుండా ఎంతసేపైనా కబుర్లుచెప్తూ, ఎదుటివాళ్ళని ఆకర్షించగలడని తెలుస్తుంది. అతడొక పట్నవాసపు మనిషి. పేరు 'మాత్యేసావిచ్, పట్నములో అతనికో మేడకూడ్కాఉందట. తనస్వంత పొలాల నొకసారిచూసిపోదామని బైలుదేరాడట ఆ అబ్బాయిపేరు "కుజ్కా," ఈసంగతులన్నీ అడిగి తెలుసుకున్నాడు తాత. ఆ రా త్రి ఎంతో ఉక్కగావుంది. ఎవరికీ నిద్రపట్టడం లేదు చీకటి దట్టంగా కమ్ముకునే టప్పటికిఆకాశంమీద అక్కడక్కడచుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. ఆకుర్రవాడు తనదగ్గరికెట్లావచ్చాడో 'మాత్యేసావిచ్' చెప్పడం మొదలెట్టాడు ముసలమ్మ పెద్దకోడలు కొంచెందూరంగా కూర్చుని కధ వింటున్నారు. కుజ్కా దూరంగా పోయి ఇటూ అటూ గంతులేస్తున్నాడు.

"చాలా కష్టమైన కధండీ తాతగారూ!" "మాత్యే"అన్నాడు. "జరిగిన కధంతా చెప్పాలంటే ఈ రాత్రికూడా చాలదు, పది సంవత్సరాల క్రితం మావూళ్ళోనే మా యింటికెదురుగా. ఒక ముసలమ్మ కాపురముండేది. భర్త చనిపోయేటప్పటికి, మిగిలిన ఆస్తి ఐదు గుర్రపు బళ్ళు. ఆమెకు యిద్దరే కొడుకులు. పెద్ద కొడుకు రైల్వేలో గార్డుపని చేస్తున్నాడు రెండోవాడికి.సరిగ్గా నాయీడే వుంటుంది. తల్లి దగ్గరే వుండేవాడు ఆబళ్ళమీద వచ్చే బాడుగతో ఆమె సంసారం గడిపేది. ఒక్కొక్కప్పుడు రోజుకి ఐదు రూపాయలకుపైగా బాడుగ వస్తూండేది.

రెండోకొడుకు కూడా తనకి చేతనైన వ్యాపారంచేస్తూ ఇంటికి కొంతడబ్బుతీసు కొస్తూవుండేవాడు.పావురాలను పెంచుతూ వాటిని పందెగాళ్ళకమ్మి డబ్బుసంపాదించేవాడు. అప్పుడప్పుడుతనయింటినడి కప్పుమీద నిలబడి, పావురాన్ని పైకివిసరి

అవి కిలకిలా కూస్తూ-మేఘాలమీద ఎగురు తుంటే చూస్తూ ఎంతో ఆనందించే వాడు. చిన్నచిన్న పిట్టల్ని పట్టుకొని పంజరాల్లో పెట్టి అమ్ముతుండేవాడు. అవన్నీ చిన్నపనుల్లా కనబడినా నెలకి మాత్రం లేదంటే పదిరూపాయిలసొమ్ము కళ్ళజూసేవాడు. అల్లాగే—కొంతకాలం గడిచినాక జబ్బుచేసి ఆముసలమ్మ మంచ మెక్కింది. ఇంట్లో ఆడదిక్కు లేదుకదా! ప్రపంచంలో సౌందర్యం గ్రుడ్డివాడికేం కనబడుతుంది! రేపోమాపో చావుతప్ప దని, ముసలమ్మ నిర్ధారణ చేసుకుని, తన రెండో కొడుకు "వాస్యా"కి పెళ్ళి చేద్దామని నిశ్చయం చేసుకుంది. ఒక స్నేహితుణ్ణి వెంటేసుకుని, వాస్యా ఈవూరూ, ఆవూరూ తిరిగి "మిషాంకా" అనేఒక వితంతువు కూతుర్ని పెళ్ళికిస్థిర పరుచుకున్నాడు. తల్లిఇష్టంమీదనే పెళ్లి జరిగిపోయింది. అమ్మాయికి పదిహేడేళ్లు వుంటాయి. చక్కగా, నాజూగ్గా ఉంటుంది. దానికితోడు ఐదువందల కట్నం, ఒకఆవు ఒకపట్టె మంచంతో సహా అత్తవారింటికి కాపరానికొచ్చింది. పెళ్లయిన మూడోరోజునే తల్లి యీ లోకంవిడిచి వెళ్లి పోయింది. కష్టాలు, దుఃఖాలులేనిస్వర్గానికి వెళ్లి పోయింది. భార్యాభర్త లిద్దరూ. ఎంతో శ్రద్ధగా, ఆ ముసలమ్మ ఆత్మ శాంతి కోసం దిన కార్యం ఏమీలోటు లేకుండా జరిపేశారు. ఆమె చావుతోటే వాళ్ల దాంపత్య జీవితం ప్రారంభమైంది. ఆరు మాసాల వరకు వాళ్ల జీవితం ఆనం దంగా గడిచిపోయింది. అంతలో, అక స్మాత్తుగా పెద్ద కష్టం, కొండలా వాళ్ల మీద విరుచుకు పడింది. "అతివృష్టి అనావృష్టి" అన్నారు పెద్దలు. పాపం! ఏ ఉద్యోగం లేని వాస్యాని మిలటరీలోకి లాక్కు పోయారు. ఎక్కడో దూర దేశాలకి పంపించేశారు. అంతా దైవ సంకల్పం, మన మేంచెయ్యగలం. వెళ్లి పోతూ, భార్య దగ్గర శెలవు తీసు కుంటున్నప్పుడైనా విచారించ లేదు గాని, ఎంతో ప్రేమతో పెంచిన పావు రాల కేసి చూచే టప్పటికి ఒక్క సారిగా దుఃఖంపొర్లిపొర్లి వచ్చింది. అబ్బా! ఆదృశ్యం చూసి, నాగుండె నీరై పోయింది.

"పురుడొచ్చే రోజులు. "మిషాంకా" ఇంట్లో ఒక్కర్తే ఉండలేక తన తల్లిని తీసుకొచ్చింది. ఆ తల్లయినా బిడ్డపుట్టిన దాకా వుంది. రెండోకూతురు దగ్గిరికి వెళ్ళిపోయింది. ఆ బిడ్డే ఈ కుజ్కా. పొలంలో పనిచేసేవాళ్ళు, గుర్రపుబళ్ళు తోలేవాళ్ళు, అందరూ త్రాగుబోతులే. ఆవిడ మాటంటే వాళ్లేమాత్రం లెక్క చేసేవారు కారు. ఇంట్లో పని చేసు కోవాలి. బైటపని చూసుకోవాలి, ఆడది ఒక్కతే ఈ పనులన్నీ చక్కబెట్టుకో గలదా? ఈ పనికి, ఆ పనికివచ్చి నన్ను సలహా అడుగుతుండేది.

"అక్కడికీ, శక్తికొద్దీ, ఆమెకేదో సహాయం చేస్తుండేవాణ్ణి, నాకు తోచిన సలహా ఇస్తుండేవాణ్ణి ప్రతిరోజూ ఆమె ఇంటికిపోయి టీ త్రాగుతూ ఈ మాటా ఆ మాటా చెప్పి కాస్త ధైర్యం కలుగ జేసేవాణ్ణి. అప్పటికి నాదికూడా చిన్న వయస్సే. అన్నివిషయాలు తెలుసుకొబట్టి నన్నందరూ ఆ వూళ్లోకల్లా చురుకైన

వాణ్ణని పిలుస్తుండేవారు. ఆమెకూడా బాగా చదువుకున్నదే. అన్నివిషయాలు తెలుసు. ఎదుటివాళ్ళని ఎల్లా మర్యాద చెయ్యాలో బాగా నేర్చుకుంది. చక్కగా, అందమైన బట్టలు కట్టుకునేది, వేసవి కాలపు సాయంత్రవేళల్లో ఊరిబైట పొలాలకేసి షికారు పోతూ వుండేది. అప్పుడప్పుడు ఆమెతో మతవిషయాలు, రాజకీయాలు చర్చించేవాణ్ణి. ఆమెనన్ను ఎంతో తెలివైనవాణ్ణని పొగిడి. టీ గాని, పళ్ళరసంగాని, ఇస్తూ వుండేది. తాతగారూ! మీరు నమ్మండి నమ్మకపోండి. ఉన్న విషయాన్ని ఒక్కమాటలో చెప్పాలంటే అల్లాగే ఒక యేడాది గడిచేటప్పటికి, నాలో శనిదేవత ప్రవేశించాడు. ఏ రోజైనా ఆమె నా కళ్ళ పడకపోతే నాకు పూర్తిగా మతిపోయేది. పిచ్చెత్తినట్లు అయేది. ఎన్నిపనులున్నా ఏదోవిధంగా తీరిక చేసుకొని ఆమెను చూసి వస్తుండేవాణ్ణి. నిజానికి ఆవేళ ఎన్నిపనులున్నా అవన్నీ మరిచిపోయి, ఆ రోజల్లా ఆమె ఇంట్లోనే కాలం గడిపేస్తూండేవాణ్ణి.

"వాస్యా పావురాల్నిపెంచే భారం కూడానామీదే పడింది. అప్పటికే రెండో మూడో పావురాలు తప్పించుకు పోయాయి. ఆమెయింటివెనుక చుట్టూ వున్నఆవరణలో రోజూ మేమిద్దరం చాలా సేపు మాట్లాడుకునే వాళ్ళం. అక్కడినుంచి మాయింటికి పోడానికి వీలుండేలా చిన్నగేటుకూడా ఏర్పాటు చేసుకున్నాం. ఎల్లాగైనా, ఒంటరిగావున్న ఆడదాన్నిచూస్తే, ఎన్నడూలేని దురుద్దేశ్యాలు గుండెలో గూడుకట్టుకుంటాయి. మనమొక్కళ్ళమేగాదు పాపాత్ములం. పెద్దపెద్దగెడ్డాలుపెంచినమహర్షులుకూడా ఆడదానికిలొంగిపోయారు. "మిషాంకా" ఎన్నడూనన్ను విడిచి ఉండేదికాదు. యుద్ధంలోకి పోయినభర్తను సరదాకి మచ్చుకైనా ఎప్పుడూ తలచేదికాదు. పైగానన్ను ప్రేమించడం మొదలెట్టింది. అవిషయం నాకూతెలుసు నేకనపడక పోతే, ఆరోజల్లాఆమెయెంతో బాధపడేది. ఇంటివెనుక ఆవరణలో ఇటూ అటూ తిరుగుతూ అస్తమానమూ నాయింటికేసి చూస్తుండేది.

అంతకంటకి నాకు పిచ్చెత్తినట్టయింది. ఒకరోజు — తెల్లవారుతోంది, ఇంకా అక్కడక్కడ చీకటుందికూడా — ఏదో పనిమీద వాళ్ళింటి కెదురుగాపోతూ గుమ్మంలోకి చూచాను. ఆమె దొడ్లో నిలబడి బాతులకి మేతవేస్తోంది. అప్రయత్నంగా నా కాళ్ళు రెండూ ఆ ఇంటి గుమ్మంవైపు కదిలాయి. నాలో అంత వరకు అణగియున్న ఆవేదన ఆపుకోలేక ఆమెని పేరెట్టి పిలిచాను. అప్పటికే శనిగాడు నానెత్తెక్కి గంతులేస్తున్నాడు. ఆమె నా దగ్గరగా వచ్చి నిలబడింది. ఆ అందమైన ముఖం తెల్లగా పాలిపోయింది. నిగనిగలాడే కళ్ళు నిద్రకోసం తపిస్తున్నాయి. ఆ తీయటి చూపుల్ని ఎంతో ప్రేమించాను. వచ్చేపోయేవాళ్ళు వింటారేమోనని సిగ్గయినా లేకుండాఆమె సౌందర్యాన్ని స్తుతించడం ప్రారంభించాను. ఆమె లేత హృదయంలో దాగియున్న ఆనందం ఒక్కసారిగా కళ్ళల్లోంచి తొంగిచూసింది.

జిగ్గున మెరుపల్లే మెరిసింది. ఆమె నవ్వుతూ నా ముఖంలోకి రెప్ప వాల్చకుండా చూసింది........ నే పూర్తిగా మైమరచి ఏదో అవ్యక్తానందంలో తేలిపోతూ, ఆమెపై నాకున్న ప్రేమనంతా వెలిబుచ్చేశాను.... ఆమె నన్ను లోపలికి ఆహ్వానించింది. ఆ రోజు మొదలు మే మిద్దరం భార్యా భర్తల్లా వంచరించాం....."

అప్పుడే "అల్యోష్కా" ఎక్కడి నుంచో ఒగుర్చుకుంటూవచ్చి ఎవళ్ళనీ చూడకుండా ఇంట్లోకి పరుగెత్తి పోయాడు. ఒకక్షణం గడిచాక బైటి కొచ్చిజేబులో డబ్బులు గలగల్లాడిస్తూ నోట్లోఏదో నెమరేస్తూ. చదీచప్పుడూ కాకుండా, వీధిలోకి పరుగెత్తిపోయాడు.

"ఎవరది" మాస్వేఅన్నాడు. "వాడు మావాడే. మారెండో అబ్బాయి. దేవుడు మాకా గూనివాణ్ణి ప్రసాదించాడు. వాడేం చేసినా, మాట్లాడక ఊరుకుంటాం." అన్నాడుతాత. "అందుకే వాళ్ళజతా వీళ్ళజతాపట్టి, పూర్తిగా చెడిపోయాడు. త్రాగడంకూడా నేర్చుకున్నాడు. ఈ మధ్యనే పెళ్ళికూడాచేశాం. పోనీ ఏనాటికైనా, కుదుటపడతాడేమో అనుకుంటే, అంతకంతకి మరీ పాడైపోతున్నాడు." ముసలామె అన్నది.

"ఆ అదేమీ ఉపయోగంలేదు. ఏదో మరొకళ్ళపిల్లని తీసుకొచ్చి మన ఇంట్లో పెంచడంతప్ప వేరే ప్రయోజనం లేనే లేదు" అన్నాడు తాత.

చర్చివెనుక ఎక్కడో దూరంగా విన సొంపైన విషాదగీతం వినపడుతోంది. మాటలు స్పష్టంగా తెలియడంలేదు, వాళ్ళ కంఠస్వరాలు మాత్రం యెంతో శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. అందరూ ఆనందంగా వింటున్నారు. ఒకక్షణంలో పాట ఆగింది. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. మళ్ళీ మరోక్షణంలో పాట వినపడసాగింది, రెండు కంఠస్వరాలు గట్టిగా, బిగ్గరగా నవ్వుతున్నాయి. మూడో స్వరం అల్లాగే గట్టిగా, మరీ గట్టిగా గొంతెత్తి పాడుతోంది. అందరూ అంతులేని ఆనందంలో మైమరచి ఆ పాట ఆకసాన్ని అందుకుందేమోనని పైకి చూస్తున్నారు.

'వార్వరా' ఇంట్లోంచి బైటికొచ్చి కళ్ళకి చేతులడ్డంగాపెట్టి చర్చివైపు చూస్తూ "క్రీస్తు కొడుకులు" అంది.

మళ్ళీ తిరిగి మూడు గొంతుల్లోంచి పాట శ్రావ్యంగా వినపడుతోంది.

"తాతగారూ! మొదట మా యిద్దరి జీవితం అదేవిధంగా ఆనందంగా సాగిపోయింది. రెండేళ్లు గడిచాయి. వార్సా నుండి "వాస్యా", తనను అనారోగ్యం వల్ల ఇంటికి పంపించేస్తున్నట్టు ఉత్తరం వ్రాశాడు. అప్పుడే ఆ క్షణంలోనే నా హృదయంలోని ప్రేమని నంపుకోడం మొదలెట్టాను. నాలో పెద్ద మార్పు దానంతటదే వచ్చింది. చక్కని పిల్లని కూడా చూసుకుని పెళ్ళికి నిశ్చయం చేసుకున్నా. కాని నన్ను ప్రేమించే హృదయానికి దూరంకావడం చాలా కష్టమనిపించింది. రోజూ నా హృదయంలో చెలరేగే సంఘర్షణ ఆమె ఎదుటనే పూర్తిగా అణిచేద్దామనుకునేవాణ్ని. కాని ఏముఖంపెట్టుకొని ఆమెకాఉత్తరం చూపించేది? ఆమె విషాద కంపిత

స్వరం నా చెవులపడితే నేనెల్లా భరించేది? ఎల్లాగో ఏదోవిధంగా ధైర్యం చేసుకుని ఆమె కా ఉత్తరంవినిపించాను. 'మిషాంకా' ముఖం తెల్లటి కాగితంలా పాలిపోయింది. "దేవుడికో దండం; మళ్ళీ తిరిగి భార్యవౌతున్నావు" అని అన్నాను. "ఆదేమీ తేలిక పనికాదు. నే నతన్ని ప్రేమించడంలేదు. నేను మనసారా ఇష్టపడి అతన్ని పెళ్ళిచేసుకోలేదు. నా తల్లి పోరుపడలేక వాగొయ్యి నేనే చేతులారత్రవ్వుకున్నా"నని మిషాంకా అంది. "ఊరికే నీ యిష్టంవచ్చినట్లు మాట్లాడకు. అది చాలా తప్పు. నువ్వు అతన్ని చర్చిలో దేవుడియెదుట పెళ్ళిచేసుకున్నావా? లేదా?" అన్నాను. "అవును; దేవుని యెదుటే పెళ్ళిచేసుకున్నా; కాని విన్నే ప్రేమిస్తున్నా. నే చనిపోయే రోజొచ్చేదాకా నీతోనే వుంటాను. ఊళ్ళోవాళ్ళందరూ తిట్టినాసరే ఆఖరికి నన్ను వెలివేసినాసరే నాకేం భయంలేదు...." ఆమె అన్నది.

"నువ్వు క్రిస్టియన్ స్త్రీవికావా? బైబిల్ చదువలేదూ? అందులో ఏంవ్రాసుందో చూశావా?" నేనన్నాను.

"పెళ్ళైనప్రతిస్త్రీ [illegible] బతకాలన్నదే!" అన్నాడు తాత.

"భార్యా భర్తలిద్దరూ ఒక్కటే శరీరం. మనిద్దరం మహాపరాధం చేశాం. అక్కడికి అదిచాలు. దేవుణ్ణి తలుచుకుని చేసిన తప్పుకు పశ్చాత్తాప్పడుదాం. వాస్కా రాగానే మనంచేసిన తప్పుచెప్పేద్దాం. అతడైనా చాలామంచివాడు. విన్నేంచంపెయ్యడులే. చేసినపాపానికి నరకంలో పడి నానాబాధలు పడేకంటే, నీభర్తచేతుల్లో నీవెన్ని కష్టాలను భరించినా తప్పులేదు" ఈ రకంగా ఎన్నివిధాల నచ్చ చెప్పినా, ఆ దుష్టురాలు నామాటలు వినిపించుకోనేలేదు. అంతసేపూ నేవాగినదంతా బూడిదలో పోసిన పన్నీరయింది. గాలిపై చెత్తలా ఎగిరిపోయింది. "నేను విన్నే ప్రేమిస్తున్నా" ఆ మాటతప్ప ఇంకోమాట పల్కనేలేదు.

"మర్నాడు పండుగనగా, శనివారం ప్రొద్దున్నే వాస్కా ఇంటికి వచ్చేశాడు. నాదొడ్లోనుంచి అంతా చూస్తున్నా. వాస్కా వచ్చీరావడంతో ఇంట్లోకివచ్చి పరుగెత్తివెళ్ళాడు. నిమిషంలో "కుజ్కా"ని చంకనెత్తుకొని బైటికొచ్చాడు. ఆబిడ్డతో తనుకూడా ఒకబిడ్డలాగే ఏడుస్తున్నాడు, నవ్వుతున్నాడు, ముద్దాడుతున్నాడు, మనసుతీరా లాలిస్తున్నాడు. ఆబిడ్డనిక్రిందికి దించడమేలేదు. అల్లాగే కొడుకుతో ముద్దులాడుతూ తను పెంచినపావురాల్ని చూడ్డానికిపోయాడు. వాస్కా నెమ్మదైనవాడు. చురుకైనవాడు కూడా. ఆరోజు సాఫీగానే సాగిపోయింది. మర్నాడు పండుగ. చర్చిలో గంటలు గణగణా మ్రోగుతున్నాయి. వాళ్ళింటికేసిచూస్తే గుమ్మానికి తోరణాలైనాలేకుండా వికారంగా వెలవెలబోతూ కనిపించింది. ఏమిటా కారణం? ఏదో గలభా జరిగివుంటుంది. తిన్నగా వాళ్ళింటికి పోయాను. వరండాలో వాస్కాకళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి. బొటబొటా కన్నీళ్ళు దవడలమీదుగా జారుతున్నాయి. చేతులు వణుకుతున్నాయి. పట్నంనుంచి తనభార్యకి తీసుకొచ్చిన వస్తువులన్నీ నేలమీద విసిరి

కొట్టేస్తున్నాడు. అప్పటికి కన్నీళ్ళు మూడేళ్ళుంటాయి. నేలమీద దొర్లుతూ తండ్రివిసిరేస్తున్న వస్తువులన్నీ కాళ్ళతో తన్నుతున్నాడు.

"మిషాంకా మూల దూర్చుని ఏడిచి పోతూ తనలో తనే సణుక్కుంటోంది "నేను నీ భార్యను కాను. నీతో నేను కాపరం చెయ్యలేను" అంటూ గట్టిగా నానా తిట్లు తిడుతోంది. నే తిన్నగా నా పడి కొచ్చి వాస్కా కాళ్ళమీద పడ్డాను. "మేం తప్పుచేశాం. నీకు తీరని ద్రోహం చేశాం. దైవాన్ని చూసి మా తప్పులన్నీ క్షమించు" లేచి మిషాంకాతో అన్నాను. "నువ్వు వాస్కా భార్యవు. నువ్వు చేసిన తప్పుకి అతనికాళ్ళు కడిగి నోట్లో నీళ్లు పోసుకో. నీ బ్రతుకు శుద్ధి అవుతుంది. అసలు అనుగుణ్యమైన భార్యలా ప్రవర్తించు. నీవు చేసిన పాపాలకి దేవుణ్ణి ప్రార్థించు. నిన్ను తప్పక క్షమిస్తాడు." నాలో భావోద్రేకం ఉప్పొంగి ప్రవహించింది. ఏ దేవతో స్వర్గం నుండి దిగివచ్చి మాట్లాడుతున్నట్టు నన్ను విషయాన్ని ఉన్నదున్నట్టుగా వాస్కా కళ్ళెదుట మాటల్లో చూపెట్టేశాను. నా గుండెల్లో కొండంత బరువు దిగిపోయినట్టుంది. కళ్ళంట నీళ్ళుకురిశాయి రెండురోజులు గడిచాక వాస్కా నా యింటికి వచ్చి "నిన్నూ, నా భార్యనుకూడా క్షమిస్తున్నా, దేవుడే మనందర్నీ చల్లగా చూడాలి ఆమె ఒక సోల్జర్ భార్య. ఇంతకీ ఆమె చేసినది పెద్ద మహాపరాధంకాదు. ఒంటరిగా వుండి ఆమె తన శీలాన్ని కాపాడుకొనలేకపోయింది. ఈ రకముగా లోకంలో మిషాంకా ఒక్కతేకాదు. ఎంతోమంది చెడిపోయారు. కాని నీకూ, ఆమెకు ఏమీసంబంధం లేనట్టే ప్రవర్తించమని ప్రార్థిస్తున్నా నేనుకూడా. ఆమెకీవిషయం నచ్చచెప్పుతా. సర్వ విధాల ప్రయత్నించి, ఆమె నన్ను ప్రేమించేలా చేసుకుంటా" అన్నాడు. ఇద్దరం సంతోషంతో కరస్పర్శ చేసుకున్నాం. తర్వాతవాస్కా ఆనందంగా ఇంటికి వెళ్ళిపోయాడు.

"దేవుడికో దణ్ణం. అప్పటినుంచీ ఏ గొడవా లేకుండా బాగానే సద్దణిగి పోయింది. వాస్కా గుమ్మందాటి వెళ్ళాడో లేదో అందరితో అనుమతంగా మిషాంకా పరుగెత్తుకుంటూ వచ్చింది. ఎప్పుడూ ఇదెక్కడి తీరు నా మెడ పట్టూ చేపలేపి, నాకేసి దీనంగా చూస్తూ ఏడుస్తోంది. నన్ను బతిమాలుతోంది "నేనది మరణం చూస్తేనా, నిన్ను నీదగ్గర చేస్తా. నిన్నే ప్రేమిస్తున్నా. నువ్వు లేకుండా నా జీవితంలో సౌఖ్యం లేదు" అంటూ ఏడ్చింది

"ఎక్కడో పిశాచంలా వుందే!" అన్నాడు తాత

"చిఱ్ఱుబుఱ్ఱుగా చెప్పేశాను, రెక్క పట్టుకు బైటకిగెంటేసి, "ఛీ! నీ మొగుడి దగ్గరకు పో. నాకు అప్రతిష్ఠ తీసుకు రాకు. నలుగురిలో తలెత్తుకు తిరగనియ్యవు. నీకు దైవభయం లేదు" అంటూ మొహమాటం లేకుండా నానా చీవాట్లు పెట్టి పంపించేశాను. ఇదేరకంగా రోజూ జరుగుతూ వుండేది.

"ఒకనాటి ఉదయాన దొడ్లో నిలబడి గుర్రపు జీను సవరిస్తుంటే - అకస్మాత్తుగా మిషాంకా నా దగ్గరికి పరు

గుతో వచ్చింది. చేతులాడిస్తూ గట్టిగా ఏడవసాగింది "నే వాడితో ఉండలేను. వాడంటే నా కసహ్యం. ఆ బాధలు పడ లేకుండా వున్నా. నన్ను ప్రేమించడం నీ కిష్టంలేదా? పోనీ, చంపేసెయ్ నీ పీడ వదిలిపోతుంది" అంటూ నా మీద పడి ఏడ్చింది. కోపం ఆపుకోలేక చేతిలో ఉన్న కళ్ళెంతో రెండు మూడు దెబ్బలు కొట్టాను. అదే సమయంలో "వద్దు, వద్దు, కొట్టొద్దు" అంటూ నిరాశతో అరుస్తూ వాస్యా పిచ్చివాడిలా పరుగెత్తు కొచ్చాడు. కసితీరా శక్తి కొద్దీ ఆమె ఒళ్ళంతా పిడికిలితో పొడిచేశాడు. నేల మీద పడేసి, కాళ్ళతో నలగ ద్రొక్కేశాడు. మధ్యని నే నడ్డుకుంటే నన్ను వెనక్కి విసిరేశాడు. నా చేతిలో కళ్ళెం లాక్కొని మళ్ళా మరోసారి చావబాదేసి ఒళ్ళంతా హూనం చేసేసి, గుర్రంలా సకిలిస్తూ వెళ్ళిపోయాడు."

"నా చేత్తో కళ్ళెం పట్టుకుని మీక్కూడా ఉంచి చూపిస్తా. నా చెల్లెల్ని చావబాదేస్తారే! మనసులేని మృగాలు" అంటూ సణుగుతూ వార్వరా అక్కణ్ణుంచి లేచి పోయింది.

"అట్టే వాగక నోరుమూసుకో" కసిరాడు తాత.

"అక్కడున్న సుసమల్ని కేకేసి, మిషాంకాని నా చేతుల మీదుగా వాళ్ళ యింట్లో దిగపెట్టి వచ్చాను. ఆరోజు సాయంత్రం మళ్ళా ఏం జరుగుతుందో నని వాళ్ళ యింటికిపోయాను. ఒళ్ళంతా కట్లతో మిషాంకా మంచంమీద పడు కుంది. ముక్కు, కళ్ళు మాత్రం కన పడుతున్నాయి. దిగాలుగా, పైన అట కేసి చూస్తోంది. పలకరించినా మాట్లాడలేదు. ప్రక్కగదిలో వాస్యా, తల చేతుల్లో పెట్టుకొని, ఏడుస్తూ అంటున్నాడు: "నేనెందుకూ పనికిరాని వాణ్ణి నా జీవితాన్ని నేనే ఖూనీ చేసు కున్నా. ఓ, దేవుడా! నన్ను చంపే సెయ్."

"మిషాంకా ప్రక్కనే కూర్చుని, ఎంతో సేపు హితబోధ చేశాను. భయపెట్టాను కూడా. "మంచివాళ్ళు చచ్చినాక స్వర్గా నికి పోతారు. నీలాంటి పాపాత్ములు నర కంలో కూలబడి నానాబాధలు అనుభ విస్తారు. నీకూడా అల్లాగే జరుగు తుంది. నరకంలోకి పోతావు నిప్పుల్లో మసైపోతావు నీ భర్తకి ఎదురాడకు. అతని కాళ్ళమీద పడు." అల్లాగే ఎంత సేపు చెప్పినా, ఒక్క మాటకూడా ఆమె నోటంట రాలేదు. అంతసేపూ ఏగోడకో బోధిస్తున్నా ననుకుంది. నాకేసి కన్నెత్తయినా చూడలేదు. ఆ మర్నాడే వాస్యా జబ్బుతో మంచమెక్కాడు. అదేమంత ప్రాణంతీసే రోగమో, వాస్యా ఆనాటి సాయంత్రమే ఈ లోకం విడిచిపెట్టి వెళ్ళిపోయాడు.

"ఖననసంస్కారం జరిగిపోయింది. మిషాంకా ఆ దరిదాపుకైనా రాలేదు. చేసిన చెడ్డపనికి సిగ్గయినా లేకుండా, ఒంటిమీద దెబ్బల్ని వాళ్ళకీ - వాళ్ళకీ చూపించేది. ఏ దిగులు లేకుండా అందరి తోటీ మాట్లాడేది. ఊళ్ళో నాలుగుమూల లకీ పుకారు వ్యాపించింది. వాస్యారోగం వచ్చి చనిపోలేదనీ, భార్యమే విషం పెట్టి చంపేసిందనీ అందరూ అన్ని రకాలుగా చెప్పుకోడం మొదలెట్టారు.

క్రమంగా ఆపుకారు పోలీసుల చెవుల్లో పడింది. హాస్పిటల్‌వాళ్ళు త్రవ్వి బైటికి తీసి పరీక్షచేసి, విషప్రయోగంవల్ల చనిపోయాడని నిర్ధారణ చేశారు. చేతులకి సంకెళ్లు తగిలించి మిషాంకాని పోలీసులు లాక్కుపోయారు. పాపం. ఏమీతెలియని పసిబిడ్డ కుజ్కాకీకూడా అదేగతి పట్టింది. ఇద్దర్నీ తీసుకుపోయి, ఎక్కడో జైల్లో పడేశారు. దేవుడు దానికి తగిన శిక్షే విధించాడు. ఎనిమిది నెలలు గడిచాక తీర్పుచెప్పారు. ఆసంగతి నాకిప్పటికీ బాగాజ్ఞాపకం మిషాంకా నెత్తిమీద ముసుగేసుకొని, బల్లమీద కూర్చుంది. శరీరం ఎముకల్లోకి ఎండిపోయింది. పాలిపోయిన ముఖంలో నుంచి కళ్ళుమాత్రం చురచురా చూస్తున్నాయి. ఆ స్థితిలో ఆమెను చూస్తే, ఎంత కటికివాడైనా కన్నీళ్లు కార్చక మానడు ఆమె వెనుకే పోలీసు భుజాన తుపాకి పెట్టుకొని నిలుచున్నాడు. విచారణ జరుగుతోంది. ఆమె తను చేసిన తప్పును ఒప్పుకోడం లేదు. భర్తకి విషంపెట్టి చంపిందని కొందరు వాదించారు, అతడే విషంపుచ్చుకొని ఆత్మహత్య చేసుకొన్నాడని కొందరన్నారు. అప్పుడు నేనుకూడా ఒక సాక్షిని. నా ప్రతిజ్ఞ ప్రకారం నిజం చెప్పేశాను,

"ఆమెదే తప్పు. జరిగిన నేరం దాచినా దాగదు. ఆమె తన భర్తని ప్రేమించలేదు. అందుకే తనకి తోచినట్టు చేసింది ..."

"సాయంత్రానికి విచారణపూర్తయింది. పదమూడు సంవత్సరాలు సైబీరియాలో కఠిన శిక్షవిధించారు, తీర్పయిన మూడు నెల్లదాకా మిషాంకా ఆ జైలులోనేఉంది. ఒకనాడామెను చూడడానికి వెళ్ళాను. నన్ను చూసీ చూడడంతోటే చేతులాడిస్తూ "పో! వెళ్ళిపో!" అంటూ అరిచింది, తన బిడ్డని ఎత్తుకుపోవడానికి వచ్చానేమోనని భయంతో కుజ్కాని దగ్గరకు లాక్కొని తన వొళ్ళో జేర్చుకుంది. "ఇల్లా చూడు మిషాంకా! నువ్వెంత హీనస్థితిలో వున్నావో తెలుస్తోందా? నే నెంత చెప్పినా విన్నావా? ఇప్పుడెంత కష్టపడుతున్నావో! పోనీ ఇప్పటికైనా నీ తప్పు నువ్వే తెలుసుకో. నీకు నువ్వే శపించుకో." ఏమి చెప్పినా వినిపించుకోకుండా ఏడుస్తూ "పో! వెళ్ళిపో!" అంటూ కుజ్కాని రొమ్ముకి హత్తుకొని వణికిపోతూ గోడమూల కూలబడిపోయింది.

"మిషాంకాని, సైబీరియా తీసుకుపోతుంటే, స్టేషన్ దాకా సాగనంపి, నామనశ్శాంతికోసం ఆమెకి తెలియకుండానే ప్రక్కనున్న మూటలో ఒక రూపాయి జారవిడిచి వచ్చేశాను, పాపం మధ్యదారిలోనే చచ్చిపోయింది."

"నీచపు బ్రతుక్కి నీచపు చావే" అన్నాడుతాత.

"కుజ్కాని ఇంటికి పంపించేశారు. వెనుకటి సంగతి విడిచి పెట్టేసి ఆ కుర్రాణ్ణి, చేరదీసి నేనే పెంచుతున్నా. తల్లి దుర్మార్గురాలైతే బిడ్డను ద్వేషించడం దేనికి ....పాపం. వాణ్ణి చూస్తే నాకెంతో జాలేస్తుంది. పెంచి పెద్దవాణ్ణిచేసి, నా దగ్గరే గుమాస్తాగా ఉంచుకుంటా. నాకు సంతానమే లేకపోతే వాడే నా కొడుకనుకుని, నే చేసే

వర్తకం వాడిచేతే చేయిస్తా. ఎక్కడికి పోయినా, ఎవర్నికూడా వెంటేసుకుని పోతుంటే, అన్ని విషయాల్లోనూ అనుభవం సంపాదిస్తాడు. ముందుముందు వాడే నా అంగటి వాడౌతాడు."

కథ చెప్పినంతసేపూ రజ్జాక్ దూరంగా వీధిగుమ్మంలో కూర్చుని, నెత్తిమీద చేయివేసి, అమాయకంగా ఆకాశంకేసి చూస్తున్నాడు.

"రజ్జాక్! పడుకుందాం! రా" యూసఫ్ కేకేశాడు.

"అబ్బా! అప్పుడేచాలాపొద్దుపోయింది. లేవండి పోయి పడుకుందాం. మంచి చెడ్డ తెలుసుకోకుండా యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే — అందరికీ — ఇల్లాంటి గతే పడుతుంది" అంటూ ఆవలిస్తూ తాత ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆకాశంమీద చందమామ చల్లగా మెల్లిగా సాగిపోతున్నాడు. వెనుక మేఘాలు తరుముకొస్తున్నాయి; పరుగెత్తే మేఘాలు చీకటిలో చెదిరిపోతున్నాయి. దూరంగా వున్న కొండల మీద, వెన్నెల వెదజల్లుతూ, చందమామ నెమ్మదిగా, కొండలమీద పడిపోతున్నాడు.

చర్చికెదురుగా తిరిగి దైవప్రార్థన చేసి, యూసఫ్ పడుకొన్నాడు. రజ్జాక్ బండికొట్టారి గడ్డిలో కాళ్లు ముడుచుకుని పడుకున్నాడు. ఇంటిలో కిటికీ కెదుట దీపం వెలుగులో నిలబడి తాత దైవప్రార్థన చేసి, ఏదో పుస్తకం చదువుతూ, తనలో తనే ప్రశ్నించుకుంటున్నాడు.

బాటసార్లు బడలికతో ఒళ్లు మరచి సుఖంగా నిద్రపోతున్నారు. ముసలమ్మ పెద్దకోడలు,సోఫ్యా — ఇద్దరూ బండిదగ్గరికి వచ్చి రజ్జాక్‌ని చూస్తూ నిలబడ్డారు.

"పాపం! తల్లిలేని బిడ్డ. నిద్రపోతున్నాడు. ఎండిపోయి, ఎముకలతో ఎల్లాగున్నాడో! తల్లి వచ్చిపోయింది. చూసేదెక్కడున్నట్టు?" ముసలమ్మ విచారంగా అంది.

"ఈ బిడ్డని చూస్తే, 'అగ్రిషాక్క' జ్ఞాపకం వస్తున్నాడు. వాడూ ఇంతే. తల్లిలేని బిడ్డ. ఈ అగ్నిపురంలో రెండేళ్ళు పెద్ద ఫ్యాక్టరీలో బానిసలా బ్రతుకుతున్నాడు. పాపం వాణ్ణి ఆ యజమాని అస్తమానూ కొడుతూనే వుంటాడట. వాణ్ణి తలచుకుంటే నా గుండె గడ్డ కట్టుకుపోతోంది" సోఫ్యా అంది.

నిశ్శబ్దంలో ఒక నిమిషం నడిచిపోయింది.

"పాపం తల్లినితల్చే మరచిపోయి వుంటాడు" ముసలమ్మ అంది.

"అవును పసిబిడ్డ వాడికేం గుర్తుంటుంది" సోఫ్యా జాలితో కన్నీళ్ళు కారుస్తూ అంది.

"చూడు చలికి ముద్దలా ఎల్లాబిగిసిపోయాడో. పిల్లిలా, దళ్ళు పొట్టలో పెట్టుకుని, నిద్రపోతున్నాడు." సోఫ్యా ప్రేమతో నవ్వుతూ విచారంగా అంది.

"....తల్లిలేనిబిడ్డ"

రజ్జాక్ ఉలిక్కిపడిలేచి కన్నెత్తి చూశాడు....ఎదురుగా కన్నీళ్ళు కారుస్తూ విచారంగా కనపడే ముఖం, ప్రక్కనే పళ్ళూడిపోయి ముడతలుబడ్డ ముసలి ముఖం, పైన అంతులేని ఆకాశంమీద చంద్రుడు, పరుగెత్తే మేఘాలు....రజ్జాక్ భయంతో కెవ్వన అరిచాడు. సోఫ్యా

కూడా కెవ్వున కేకేసింది. ఇద్దరి అరుపులు దూరంగా ప్రతిధ్వనించి వీచే గాలిలో, ఒకనిమిషందాకా చిన్నమూలుగులా వినపడి, పైకెగిరిపోయాయి. ఇంటికి సమీపంలో, గస్తీతిరిగే మనిషి ఈల వేశాడు కుక్క మొరుగుతోంది. మంచ్యే ఏదో కలవరిస్తూ ఇటూ అటూ దొర్లి, ప్రక్కగా తిరిగి నిద్రపోయాడు.

రాత్రి రెండు జాములు గడిచింది. అందరూ గుర్రెత్తి నిద్రపోతున్నారు. సోఫ్యా మాత్రం మెలకువగానే వుంది. వీధి గుమ్మంలో కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఎదురుగా విశాలమైన వీధి రెండుమైళ్ళ దాకా పోతుంది. చర్చి వెనుక చందమామ చల్లగా సాగిపోతున్నాడు. వీధిలో ఒకవైపు వెన్నెల పడుతోంది. రెండో వైపున పల్లటి నీడ ఆక్రమించింది. ఆ వెన్నెట్లో వీధి పొడుగునా, ఇళ్ళనీడలు పడుతున్నాయి! ఫిలిప్ యింటి గుమ్మానికి ఎదురుగా చర్చి పెద్ద పెనుభూతంలా, నీడ పరుచుకుంది. వీధిలో ఏ అలికిడీలేదు. అంతటా నిశ్శబ్దం అప్పుడప్పుడు వీధి చివరనుండి సంగీతం మెల్లిమెల్లిగా వినపడుతోంది. ....బహుశ ఆ గ్రిష్కా వాయిస్తూంటాడు.

చర్చికి సమీపాన చీకటి నీడల్లో, ఏదో ఒకస్వరూపం అటూ ఇటూ కదులుతోంది. ఆ కదిలేది మనిషో, జంతువో సోఫ్యా గుర్తించలేకపోతోంది. కొమ్మమీద పిట్టో రెక్కలు దిస్తోందనుకుంది అప్పుడే. ఆ స్వరూపం చీకటి నీడల్లోంచి బైటపడి, పురుష స్వరంతో ఏదో మాట్లాడి చర్చి వెనుక మాయమైపోయింది. కొంతసేపైనాక మరో స్వరూపం తిన్నగా, తాత యింటి వైపే వస్తోంది. గుమ్మంలో కూర్చుని సోఫ్యాని చూసి ఛటుక్కున ఆగింది.

"వార్వరా! నువ్వా!" సోఫ్యా అంది.

"ఆఁ! అయితే"

వార్వరా ఒక నిమిషం అక్కడే నిలబడి. సోఫ్యా దగ్గరే గుమ్మంలో చతికిలబడింది.

"ఎక్కడికి పోయావు!" సోఫ్యా అడిగింది.

వార్వరా సమాధానం చెప్పలేదు.

"రాత్రిళ్ళు ఈవిధంగా తిరిగి, అనవసరంగా చిక్కుల్లోపడకు. విన్నావుగా! మిషాంకాకి ఏగతిపట్టిందో! తెలిసిందా! జాగ్రత్తగా మసులుకో, లేదా నీకూ కూడా అల్లాంటిగతే పట్టిస్తారు" సోఫ్యా అంది.

"సరే వాళ్ళ యిష్టంవచ్చినట్టు చెయ్యనియ్యి!"

వార్వరా నోట్లో రుమాలు పెట్టుకొని నవ్వుతూ "ఇప్పటిదాకా, ఆ ప్రీస్టు కొడుకుతో సుఖంగా కాలంగడిపి వచ్చాను" నెమ్మదిగా పలికింది.

"అంతా అబద్ధం"

"కాదు నిజమే"

"అది మహాపాపం"

"సరే తప్పయితే అవుతుంది. నాకేమీ లెక్కలేదు. ఈదిక్కుమాలిన బ్రతుక్కంటే, నెత్తిమీద పిడుగోపడి చావడం ఎంతో మంచిది. నాది లేత వయస్సు; యౌవన రక్తం; నాలో ఎన్నో కోర్కెలను రేకెత్తిస్తోంది. ఇంక నా మొగుడో - గూనివాడు, ఎందుకూ

పనికిరానివాడు ఆ ముసలాడికంటె కనా కష్టంగావుంటాడు. ఛీ!ఎందుకా మొగుడు? ఉంటేం లేకపోతేం? నా చిన్నతనంలోనే తిండికికూడా కరువాచిపోయాను. ఆ దరిద్రంనుండి తప్పించుకునేందుకు డబ్బు కాసించి, ఈ గూనివాణ్ణి పెళ్ళిచేసుకున్నా. వలలో పడ్డ చేపలాగైంది నా బ్రతుకు. మరొకణ్ణి చేసుకుంటే ఈ పాటికి ఎంతో సుఖపడుతూ వుండేదాన్ని. నీ బ్రతుకూ అంతేగా! చూస్తే రోతపుట్టుకొస్తోంది. ఫియోదార్ నిన్నెక్కడికో తరిమేశాడుగదా! మళ్ళీ, మరెవత్తెనో చేరదీసి సుఖంగా కాలక్షేపం చేస్తున్నాడు. నీసూచే మరిచిపోయుంటాడు. నీ కొడుకునికూడా తనదగ్గరే వుంచుకొని, నానా చాకిరీ చేయించుకుంటున్నాడు. పోనీ, ఇక్కడైనా సుఖపడుతున్నావా! లేచినది లగాయితు పడుకునేదాకా వెట్టిచాకిరి చేస్తుంటావుకదా! ఎప్పుడైనా ఒక మెప్పుమాట నువ్విన్నావా! ఇల్లాగే నేవచ్చేదాకా అప్రీస్టు కొడుకుతోటే తిరుగుతుంటా. ప్రతిరోజూ ఎంతో కొంత డబ్బిస్తుంటాడుకదా! దానితోనాకు తిండికిగడిచిపోతుంది. పోనీ ఎక్కడో అక్కడ ముష్టెత్తుకుంటాను. లేదా ఏనుయ్యో, గొయ్యోచూసుకోడం తప్పదు....".

"అది మహా పాపం" సోఫ్యా మళ్ళీ అంది

"అయితే ఏమౌతుంది"

చర్చివెనుక దూరంగా మళ్ళీ అమూడు స్వరాలు గొంతెత్తి పాడుతున్నాయి. విషాదగీతం వినిపిస్తోంది. మాటలు బోధపడ్డంలేదు.

"వాళ్ళప్పుడే నిద్రపోరు" వార్వరా పకపకా నవ్వుతూ అంది.

ఆ చర్చివెనుక ప్రతిరోజూ అర్ధరాత్రి వేళ ప్రీస్టు కొడుకును కలుసుకోడం: ఇద్దరూ మనసిచ్చి మాట్లాడుకోడం: అప్పుడప్పుడు ఇంటికొచ్చే బాటసారులతో సరసాలు చెయ్యడం: ఇవన్నీ వార్వరా చెప్పడం మొదలెట్టింది మళ్ళీ చర్చివెనుక విషాదగీతం వినిపిస్తోంది. ఇద్దరి హృదయాలూ జలదరించి జీవితంలో స్వేచ్ఛకోసం పరితపించాయి సోఫ్యా నవ్వుతోంది. ఆ అమాయక హృదయానికి ఆ గీతం వినడం ఎంతో తప్పుగాతోచింది. కాని అల్లాగే అంతులేని ఆనందంతో వినసాగింది. తన జీవితాన్ని తానే అసహ్యించుకుంటోంది, యౌవనంలో తనుకూడా అల్లాంటి ఆనందం అనుభవించ లేకపోయినందుకెంతో సిగ్గుపడింది వార్వరా అంటే అసూయ పుట్టింది కూడా. చర్చిలో పన్నెండు గంటలు కొట్టారు.

"ఈపాటికిమనం నిద్రపోయేవాళ్ళం" అనుకుంటూ. మెల్లిగా చప్పుడు కాకుండా వరండాలోకి పోయారు.

"తర్వాత మిషాంకాను గూర్చి ఏం చెప్పినాడో వినకుండా వెళ్ళిపోయాను" కిటికీ ప్రక్కనే పక్కవేసుకుంటూ వార్వరా అంది.

"భర్తకు విషం పెట్టింది. జైల్లోచచ్చిపోయిందట"అని చెప్పాడు.

వార్వరా, సోఫ్యా ప్రక్కనే పడుకుని గుసగుసలాడుతోంది. "నేను కూడా అలోష్కాని ఆ విధంగా చేసేస్తే నాకే విచారమూ వుండదు."

"ఏమిటా చెడ్డమాటలు? మాట్లాడక పడుకో" సోఫ్యా కునుకుతూ అంది.

వార్వరా, సోఫ్యాని అటూ ఇటూ, కదిపి చెవిలో చెప్పడం మొదలెట్టింది. "ఎందుకు మనకీ తిప్పలు? మనం బ్రతికినా ఒకటే, చచ్చినా ఒకటే. మన ముఖాలకి సుఖం కూడానా. ఇంటిలో చాకిరీ చెయ్యడం చివాట్లుతినడం ఎప్పుడూ ఇల్లాగే వుందామంటావా? మనకిమాత్రం సుఖం, ఆనందం అక్కర్లేదూ? నే చెప్తా విను. ఆ ముసలాడు, అల్యోష్కాలే మన కష్టం. వాళ్ళిద్దరి పీడ వదల్చుకుంటే ముందు స్వేచ్ఛ ఆనందం సౌఖ్యం- అన్నీ మనవే"

సోఫ్యా క్షణంమాత్రం చలించి, ఏం మాట్లాడకుండా ఆకాశంకేసి చూస్తోంది.

"ఎవళ్ళకీ తెలియదు. ముసలాడెల్లాగా కాటికి కాళ్ళుచాపే వున్నాడు. అల్యోష్కాకి త్రాగుడెక్కువై చనిపోయాడను కుంటారు" వార్వరా.

"ఏమో అబ్బా, నాకు భయమేస్తోంది. దేవుడు మమ్మల్ని శిక్షిస్తాడు"

"దేవుడేం చేసినా సరే.........."

ఇద్దరూ నిశ్శబ్దంలో ఏదో ఆలోచిస్తున్నారు.

"చలేస్తోంది అబ్బా, అప్పుడే తెల్లవారిపోతోందే..నాకసలు నిద్రపట్టిందా?"

సోఫ్యా వొళ్ళంతా వణికి పోతూ అంది

"లేదు....నే అనే మాటల్ని అంతగా పాటించకే ఈ పనికిమాలిన వాళ్ళని చూస్తూంటే నాకు పిచ్చెత్తి పోతోంది. ఏం చెప్పడానికీ ఏమీ తోచడంలేదు. సరే! పడుకో! తెల్లవారి పోతోంది.... పడుకో" వార్వరా నెమ్మదిగా అంది.

ఇద్దరూ నిద్రపోయారు.

అందరికంటె ముందుగా ముసలమ్మ లేచికూర్చుంది సోఫ్యాని లేపి. ఇద్దరూ కలిసి దూళ్ళసాలలోకి పాలు పితకడానికి పోయారు. అప్పుడే అల్యోష్కా చిత్తుగా త్రాగి గంతులేస్తూ వచ్చాడు. ఒళ్ళంతా బూడిద. ఎక్కడ తూలిపడ్డాడో, మోకాళ్ళు కొట్టుకుపోయాయి. అల్లాగే గట్టిగా అరుస్తూ దూళ్ళసాలలోకి పోయి ఇటూ అటూ ఇష్టంవచ్చినట్టు గంతులేసి మూల కూలబడి ఆ దుమ్ముకొట్టిన గడ్డంతోనే గుర్రెత్తి నిద్రపోయాడు.

సూర్యోదయమైంది. చర్చి క్రాస్ మీదుగా సూర్య కిరణాలు ప్రసరిస్తూ కిటికీల్లోకి దూసుకుపోతున్నాయి, మంచులో తడిసిన పచ్చికమీద చెట్ల నీడలు పడుతున్నాయి. మాట్వే కళ్ళు నులుపుకుంటూ లేచి "కుజ్మా, లేరా, అప్పుడే ప్రొద్దెక్కిపోయింది త్వరగా వెళ్ళిపోదాం. బండి సిద్ధంచెయ్యమనరా" అంటూ కంగారుగా అరుస్తున్నాడు.

ప్రొద్దుటివేళ కలకలం బైలుదేరింది, ఎర్ర చీర కట్టుకున్న స్త్రీ గుర్రాన్ని తోలుకుంటూ తాత మాతికాడ కొచ్చింది. మాతిలో నీళ్ళు తోడుతున్న చప్పుడవుతోంది.

కుజ్మా ఒళ్ళంతా మంచులో తడిసిపోయింది. బద్ధకంతో ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుని కోటు తొడుక్కుంటూ, చలికి వణికిపోతూ, నీళ్ళు తోడే చప్పుడు వింటున్నాడు

"సోఫ్యా! మానౌకర్ని పిలిచి త్వరగా బండి కట్టమని చెప్పమ్మా" మాట్వే

# ఉన్మీలనము

శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్

దేవళమునందె నివసించు దేవుడనుచు
ప్రాతమాటలలోని విభ్రాంతివలదు;
అంటని ఛీత్కృతియించు నట్టి జనుల
కన్నుగొనలందు దేవుని కాపురమ్ము!

* * *

చలితమానవ హృదయ సంచయమునందు
వెలయుచున్నది విప్లవానలము, నిజము;
ఎప్పుడో ప్రజ్వలింపగానున్నదోయి:
కాల్చి, మసిజేయ, ధనిక సంఘములగముల.

* * *

సంపదను బట్టి మానవ సంఘమందు
కొలది గొప్పల భేదమ్ము గూర్చినారు,
పుట్టినప్పుడు, తరువాత గిట్టినపుడు
కలిమి లేముల భేదమే కానరాదు!

* * *

చివికి, పసిచెడి, మివుల విశీర్ణమైన
సంఘపుం గట్టుబాటుల సమయజేసి,
సవ్యమార్గానువర్తివై సంచరింప
నడుము బిగియించిరమ్ము ముందడుగువేయ.

# భూమి కోసం

శ్రీ అనిసెట్టి సుబ్బారావు

తొలికారు వచ్చె రారండి రైతుల్లార !
తొలిపోరు వచ్చె రారండి రైతుల్లార !

ఉరిమింది, మెరిసింది ఉదధులూగించింది
నిండుమేఘాలు వానలు క్రుమ్మరించింది!
జగతి పులకించింది, జలక్రీడలాడింది
జవ్వని ఎదురుచూసినటు సిగ్గుపడుతోంది!
తొలికారు వచ్చింది రండి రండోయి!

అలుమగలను చీల్చి అతిక్రూరుడతడు
భూమినీ పురుషునీ విభజించి పాలించె!
బంగారు పంట రైలెక్కి పోయెను నాడు
కడుపు మంటకు మనకు కన్నీరు మిగిలె!
తొలిపోరు వచ్చింది రండి రండోయి

మానభంగమైన భూమిని పగతోడ
చెట్టు చేమల చేతులెత్తి ఘోషించింది !
అసహాయ మీభూమి, అన్నాతురులు మనము
ఆదరించి పోషించి పండించాలి రండి !
తొలికారు తొలిపోరు కలిశాయి రండి !

ఆకలి దప్పుల్లో ఆలుబిడ్డలను
కడసారి మనసార కౌగలించండి !
పంట భూములు మనవి, పాడిగేదెలు మనవి
తెండి గొడ్డళ్ళు, నాగళ్ళు సర్వం తెండి !
తొలికారు తొలిపోరు కలిశాయి రండి !

రాక్షసుడు రావణుడు పీడించడిక, జాన
కీ వియోగమ్ము లేనే లేదు రండి !
ఎఱ్రని ఎండలో నెరియలై విచ్చిన
నుదుట మిణుగురులద్ది ఎదురు చూస్తోంది భువి !
రండి రాముల్లార రండి రారండి!
లెండి రైతుల్లార లెండి సేనలగ !

# నాటకం - వాస్తవికత

— ఫ్రెడరిక్ ఎంగెల్సు —

[ఇది 1859 మే 18 న ఫెర్డినాండ్ లాసెలేకు ఫ్రెడరిక్ ఎంగెల్స్ వ్రాసిన ఉత్తరం. లాసెలే (1825 - 1864 లో) జర్మన్ కార్మికోద్యమాన్ని ప్రతిబింబిస్తూ, బిస్మార్కుతోను, ప్రష్యన్ నిరంకుశ ప్రభుత్వంతోను రాజీధోరణికి దిగినప్పుడు మార్క్సు ఎంగెల్సులు అతన్ని తీవ్రంగా విమర్శించాడు ఇదే విషయంమీద లాసెలేకు మార్క్సుకూడా ఒక లేఖ వ్రాశాడు

ఇది మార్క్సు, ఎంగెల్సులు వ్రాసిన "లిటరేచర్ అండ్ ఆర్టు" అనే గ్రంథంలోది.

—— సంపాదకుడు.]

మీ "సికింజెన్"ను గురించి నా అభిప్రాయం తెలుపవలసియుండి కూడా, ఇంతకాలంగా నేను మీకేమీ వ్రాయక పోవడం మీకు వింతగానే వుంటుంది. కాని, "సికింజెన్"మీద నా అభిప్రాయం చెప్పవలసి వుండడం వల్లనే, ఇంత ఆలస్యమైంది

ఇప్పుడు వచ్చే చౌకరకం సాహిత్యం నే నట్టే చదవడంలేదు ఎప్పుడన్నా చదివినా, దానిమీద ఒక స్పష్టమైన అభిప్రాయం చెప్పేటంత విమర్శగానూ చదవడంలేదు ఏదో మామూలుగా పైపైన చూసి, అభిప్రాయం చెప్పగూడదు కూడా, ఇంకా నేను అప్పుడప్పుడూ చదివే థాకరీ లాంటివారి ఉత్తమాంగ్ల నవలలుకూడా, వాటికి సాహితీ సంస్కృతుల దృష్టిలోను, చారిత్రకంగాను నిస్సందేహంగా ప్రాముఖ్యం వున్నప్పటికీ, నాలో ఒక్కసారైనా అంతగా అభిరుచి కలిగించలేక పోయాయి. ఈ విధంగా ఇన్నాళ్ళు బట్టీ పనిచేయని నా విమర్శా శక్తి మందగించింది కనుక నేను ఒక స్పష్టమైన అభిప్రాయంచెప్పడానికి ఇంత కాలం పట్టింది పైనిచెప్పిన సాహిత్య గ్రంథాలకంటె మీ "సికింజెన్" ప్రత్యేక శ్రద్ధ తీసుకోదగింది అందువల్ల దాని కోసం కొంతకాలం వినియోగించడానికి సంకోచించను. మీ జాతీయ జర్మన్ నాటకాన్ని మొదటిరెండుసార్లు చదివినప్పుడు అందులోని వస్తువూ చిత్రణాకూడా నన్ను ఉద్రేకపరచి ఆ పుస్తకం అవతల పెట్టి ఆలోచించేటట్లు చేశాయి. నేను నిజంగా సిగ్గుపడుతూనే ఈమాటలు చెబుతున్నాను-ఈమధ్య సాహిత్యంలోవచ్చిన భావ దారిద్ర్యం నా అభిరుచినే చంపేసి, ఏమాత్రం విలువ ఉన్న పుస్తకాన్నయినా సరే, ఒక్కసారి చదవడంతోటే మెచ్చుకొనే స్థితికి తెచ్చింది. అందుకనే

కేవలం నిష్పక్షపాతంగా విమర్శా దృష్టిని అలవరచుకోవడం కోసం 'సికింజెన్'ను అవతల పెట్టాను. చదవమని ఇక్కడున్న జర్మన్ సాహితీపరుల కిచ్చాను పుస్తకం వనితా విత్తం చెప్పేదేముంది? ఇచ్చిన పుస్తకం సాధారణంగా మళ్ళీ తిరిగిరాదు. నేను బలవంతంగా నే మళ్ళీ 'సికింజెన్' తెప్పించుకోవలసి వచ్చింది. తర్వాత మళ్ళీ నేను మూడోసారి, నాల్గోసారి, చదివినప్పుడుకూడా మీ పుస్తకం మీది నా మొదటి అభిప్రాయమే ధృవపడింది అందువల్ల మీ 'సికింజెన్' విమర్శకు నిలువగలదనే నమ్మకంతో, ఇప్పుడు మీకు నా అభిప్రాయం తెలియపరుస్తున్నాను.

నేటి పేరుపొందిన జర్మన్ కవుల్లో ఒక్కరైనా, ఈ నాటకానికి యేమాత్రమైనా పోలింది ఏదీ వ్రాయలేకపోయారని చెబితే, అది అతిశయోక్తి కాదని నాకు తెలుసు. కాని చుట్టూ ఏమి జరుగుతున్నా పట్టించుకోకుండాపోవడం మన సాహిత్యానికి నిజంగా ఒక లక్షణమైపోయింది.

మీరు నేర్పుతో సమకూర్చుకున్న కథా వస్తువూ, నాటకం దృష్టిలో చేసిన చిత్రణా చూస్తే నాకు చాలా ఆశ్చర్యం ఆనందం కలిగాయి పద్య రచనలో మీరు కొంత స్వతంత్ర ధోరణిలో పోయారు. అందువల్ల, ప్రదర్శనంలో కంటె, చదవడంలో ఎక్కువ చిక్కు వస్తుంది. మీరు ప్రదర్శనంకోసం తయారు చేసిన ప్రతి చూడాలని వుంది ఇది ఇప్పుడున్న విధంగా ఎలాగూ ప్రదర్శన యోగ్యం కాదుగదా! ఈ మధ్య మా దూరపుచుట్టం కారల్ సైబెల్ అనే ఒకతను నాదగ్గరకు వచ్చాడు. అతనికి నాటక రంగంలో బాగా పరిచయం వుంది. పర్షియన్ గార్డులో రిజర్విస్టుగా అతను కొద్ది రోజుల్లో బెర్లిన్ రాబోతున్నాడు అతని ద్వారా మీ కొక ఉత్తరం పంపుతాను. అతనికి మీ నాటకమంటే చాలా మంచి అభిప్రాయం వుంది. కాని, నాటకంలో అతి దీర్ఘమైన స్వగతాలుండడం వల్లా, ఒకే పాత్ర అంతులేకుండా ఉపన్యాసాలు దంచుతూంటే, తక్కిన పాత్రలు తమకు సంబంధంలేనట్లు కనిపించకుండా వుండడానికి ఆ మొదటి పాత్రనే మాటిమాటికీ అనుకరించ వలసి రావడం వల్లా- ఈ నాటకం ఎంత మాత్రం ప్రదర్శనకు పనికిరాదని అతని అభిప్రాయం.

మీ చివరి రెండంకాలు చూస్తే మొదటి మూడంకాల్లోని సంభాషణలు సజీవంగాను, వేగంగాను నడిచేటట్లు మామూలుగా అన్ని నాటకాల్లోలాగానే కొన్ని రంగాలు మినహాయించి మీరు సులభంగానే మార్చగలరని నా నమ్మకం. మీ నాటకాన్ని ప్రదర్శనానికి తయారు చేసేటప్పుడు ఈ సూచన దృష్టిలో పెట్టుకుంటారని నమ్ముతాను దీనివల్ల నాటకంలోని వైజ్ఞానిక విషయానికి కొంత దెబ్బ తగులుతుంది, కాని తప్పదు. మహత్తరమైన మేధశ్శక్తితోను, స్పష్టమైన చారిత్రిక వస్తువుతోను మీరు జర్మన్ నాటక సాహిత్యానికి వన్నె తెచ్చారు. అయితే ఈ మేధశ్శక్తీ, చారిత్రిక వస్తుస్వీకరణా - షేక్స్పియర్ రచనల్లోని జీవంతోను, అభినయంతోను

ఇంకా ముందు పెంపొందాలి, బహుశః ఈ పని జర్మన్లవల్ల అయ్యేది మాత్రంకాదు. ఈ 'కొత్తపాతల మేలి కలయిక'లోనే నేను నాటక సాహిత్యం యొక్క భవిష్యత్తును చూస్తున్నాను, మీ 'సికింజెన్' నాటకం పూర్తిగా సరైన పంథాలో వుంది. అందులోని ప్రధాన పాత్రలు స్పష్టమైన వర్గాలకూ, దృక్పథాలకూ, అప్పటి వారి అభిప్రాయాలకూ నిజంగా ప్రతినిధులు. వారి అభినయం వెనుక వుండే అంతర్యం అల్పమైన వ్యక్తిగత వాంఛల్లో కాక చారిత్రకంగా వారు నడిచే నడకమీద ఆధారపడివుంది. అయినా ఇంకా సాధించిన అభివృద్ధి ఏమంటే ఈ అంతర్యాలు ఎక్కువ సజీవంగానూ, స్పష్టంగానూ, ఎప్పటికప్పుడు చాలా భాగం అభినయం ద్వారానే వ్యక్తపడేటట్లునూ వుండాలి. మీ వెనుకటి ఉపన్యాస ధోరణి నాకు తెలుసు అది ఏ న్యాయస్థానంలోనో లేక ఏ సభాస్థానంలోనో అయితే ఉపయోగపడుతుంది. కాని నాటకంలో ఆ విమర్శలూ, చర్చలూ కేవలం అనవసరం. సాహిత్యదృష్టిలోని నాటకానికీ, ప్రదర్శన దృష్టిలోని నాటకానికీ ఉండే భేదాన్ని నిర్ణయించడానికి ఇదీ కొలబద్దగా మీరు గుర్తించినట్లు కనిపిస్తున్నారు. పరాకాష్ఠ పొందడం అంత తేలికకాదు. కనుక కొంత కష్టపడి అయినా సరే, మీ "సికింజెన్"ను ఈ దృష్టిలో ప్రదర్శన యోగ్యమైన నాటకం చెయ్య వచ్చునను కుంటాను. ఇందులోనే పాత్రపోషణ కూడా ఇమిడివుంది. ఇప్పటి నాటకాల్లో వుండే తేలికపాటు తెలివి తేటలతో కూడిన పాత్రల చాలని వ్యక్తిత్వం ఈ నాటి బూర్జువా సాహిత్యపు పతనదశకు ముఖ్యమైన చిహ్నమని మీరు చెప్పినమాట నిజం. అలాంటి పాత్ర పోషణను, మీరు న్యాయంగానే త్రోసిపుచ్చారు. కాని, నాదుతోచే మాటొకటి చెబుతాను. పాత్రపోషణ అంటే, ఆపాత్ర ఏమిచేస్తాడనేకాక, ఏలా చేస్తాడనేదికూడా ప్రధానమని నా ఉద్దేశం. ఈదృష్టిలో మీపాత్రపోషణ ఇంకా విశితంగానూ, వివిధ ప్రకృతులను ఎత్తి చూపుతూ ఇంకా స్పష్టంగాను ఉన్నట్లయితే మీ నాటకంలో వైజ్ఞానిక విషయం నాటకాన్ని దెబ్బకొట్టేది కాదని నేను నమ్ముతున్నాను. పూర్వీకుల స్వభావాలను చిత్రించడం మాత్రమే ఈనాడు చాలదు. ఈ విషయంలో, నాటక కళాభ్యుదయ చరిత్రలో షేక్స్పియర్ ప్రత్యేకత ఏమిటో మీరు ఆలోచించ వలసింది కాని, ఇవన్నీ అంత ప్రధాన విషయాలు కావు మీ నాటకంలోని ప్రధానవిషయాల మీదనేను ఆలోచించింది మీకు అందజేయడం కోసమే సూచనగా ఇస్తున్నాను.

ఇక చారిత్రకమైన నాటక వస్తువును గురించి వ్రాస్తాను. సికింజెన్ నాయకత్వాన నడిచిన ఉన్నత వర్గాల జాతీయోద్యమాన్నీ, దీనిప్రక్కనే, తర్వాత ఆస్తిక వాదంగాను సంస్కార వాదంగాను పరిణమించిన తాత్విక జీవకారుణ్యోద్యమాన్నీ మీరుచాలా స్పష్టంగాను, అనంతర పరిణామాలను సూచిస్తూ, రెండు వైపుల నుంచీ చక్కగా చిత్రించారు. ఇక్కడ సికింజెనుకూ చక్రవర్తికీ మధ్య నడిచిన 'రంగమూ, పోప్ ప్రతి

నిధికీ ట్రియర్ అర్చిబిషపుకూ మధ్య నడచిన రంగమూ చాలా బాగున్నాయి. ఇందులో సాహిత్యాన్నీ, కళనూ, అర్థం చేసుకోవి రాజకీయంగాను తాత్వికంగాను ముందు చూపుగల ప్రాపంచిక వ్యక్తినీ, చుట్టూగోడలు కట్టుకొని సంకుచితంగా కూర్చున్న జర్మన్ షరాధిపతినీ మీరు ఎంతో వాస్తవికంగా చిత్రించారు. నిజంగా ఒక పోప్‌ప్రతినిధికీ, ఒక జర్మన్ షరాధిపతికీ మీపాత్రలు ఆయా స్వభావాలతో పూర్తిగా ప్రాతినిధ్యం వహిస్తాయి. సికింజెనుకూ కాదిల్‌కూ మధ్య నడచిన రంగంలో కూడా ఆపాత్రల పోషణ చాలా చక్కగా ఉంది మీరు ప్రధానంగా భావించే 'హట్టన్' స్వీయ చరిత్రను నాటకంలో ప్రవేశ పెట్టేటప్పుడు మీరు త్రొక్కిన త్రోవ దుర్గమమైంది. ఐదో అంక లోని ఫ్రాంజ్, బల్తాసర్ల సంభాషణలో బల్తాసర్ తనయజమానితో తానుఅనుసరించవలసిన పవిత్రమైన విప్లవపంథాను గురించి చెప్పడం కూడా. ఇందులో చాలా ముఖ్యమైన ఘట్టం. ఇక్కడే అసలు విషాద సంఘటన ఏర్పడుతుంది ఇది ఇంతముఖ్యమైంది కనుక, దీనికి మూడో రంగంలో ఇంకా బలవత్తరమైన సూచనలు కనిపించవలసివుంది - అక్కడ అందుకు అవకాశం కూడా వుంది అది అలా వుంచండి - నేనుచిల్లి అప్రధాన విషయాల్లోకి పోతున్నాను

ఆనాటి నగరాల స్థితిగతులనూ, రాజుల పరిస్థితులనూ, మీరు యెంతో స్పష్టంగా చూపెట్టారు ఆనాటి జాతీయోద్యమంలోని అధికార వ్యక్తులనబడే వారిని కూడా కడిగి విడిచిపెట్టారు. కాని పేదవాళ్ళనూ, రైతులనూ, వారి మానసిక భావాలనూ మీరు తగినంతగా నొక్కి చెప్పలేదని నే ననుకొంటాను. ఉన్నతవర్గాల జాతీయోద్యమ మంతగా ఆనాటి రైతు వుద్యమంకూడా జాతీయమైందే; గాచరిత్రానికి వ్యతిరేకమైందే. తర్వాత ఆ వుద్యమం యెలా పడిపోయిందీ మీరు నిశితంగానే చూపారు. పోరాటంలో ఎజాదరణ పొందిన పిదప ఉన్నతవర్గాలకు అధికారం చేజిక్కగానే సికింజెన్‌ను అతని గతికి అతన్ని వదిలేసి, వారు తమ విరంకుశత్వాన్ని సాగించ బూనుకున్నారు - ఇదే చారిత్రకంగా వారి పాత్ర - అస్పష్టంగా మీరు తేల్చివేశారు నాటకమంటే మీ దృక్పథాన్నిబట్టి చూసినా, ఇక్కడ తగినంత వాస్తవికంగా లేక, కేవలం తేలిపోయినట్లు నాకు కనిపిస్తున్నది. రైతు వుద్యమానికి ఇంకా ప్రాముఖ్యం యివ్వవలసింది. జోస్ట్ ఫ్రిడ్జ్‌తో రైతు మాట్లాడే రంగం చాలా స్వాభావికంగావుంది ఆ 'తిరుగుబాటుదారు' వ్యక్తిత్వం రూడా సరిగ్గా చిత్రించబడింది కాని ఆనాటి ఉన్నత వర్గాల వుద్యమానికి కూడా వ్యతిరేకంగా అప్పటికే అధికంగా ఉన్న ఆందోళనను మాత్రం సరిగ్గా ప్రతిబింబించలేదు.

నాటకాలంటే నా అభిప్రాయాన్నిబట్టి ఏ నాటకంలో నైనాసరే, వైజ్ఞానిక విషయాల పేరిట, ఎక్కడా వాస్తవికతను మరుగు పరచరాదు షిల్లర్‌ను చూసి షేక్స్పియరును విస్మరించరాదు. వైవిధ్యంతో కూడిన నాటి పేదల జీవితాన్ని ఈ నాటకంలో ప్రవేశపెట్టినట్లయితే

అది నాటకానికి వస్తువులో పూర్తిగా నూతనత్వాన్ని ప్రసాదించి, జీవం చేకూర్చేది; ఉన్నత వర్గాల జాతీయోద్యమం వెనుక జరుగుతున్న పోరాటానికి రూపురేఖలు దిద్దేది: అసలు ఈ జాతీయోద్యమాన్నికూడా సరిగ్గా, స్పష్టంగా వ్యక్తం చేసేది. ఒకవంక జమీందారీ సమాజం బహాబహలైపోతూ దమ్మిడీలేని రాజాలతోనూ, దరిద్రంతో తన్నుకుంటున్న సైనికులతోనూ, రకరకాల సాహసాలు చేసే వాళ్ళతోనూ-ఆ రోజుల్లో ఎన్నెన్ని రకాల వింత వింత ప్రకృతులతో పాత్ర పోషణ చెయ్యవచ్చు! ఫాల్‌స్టాఫ్ రకం వాతావరణం షేక్స్పియర్ నాటకంలో కంటె, ఇలాంటి చారిత్రక నాటకంలో ఎంతగానో రాణించేది.

ఇంతే కాక, రైతు ఉద్యమాన్ని నిర్లక్ష్యం చెయ్యడం వల్లనే, మీరు ఒక దృష్టిలో ఉన్నత వర్గాల జాతీయోద్యమాన్నికూడా ఉచితంగా ప్రతిబింబించలేకపోయారు. చివరకు సికింజెన్ దుర్గతికి కారణభూతమైన, ఏకంగా విషాదకరమైన స్వభావాన్ని గమనించలేకపోయారు. నా బుద్ధికి చూస్తే, అప్పటి ఉన్నత వర్గాలు రైతులతో సంబంధం పెట్టుకోవాలనే ఆలోచించలేదు; అణగద్రొక్కబడిన ఆ పేద రైతులనుంచి తమకు వచ్చే ఆదాయమే వారికి ముఖ్యమనిపించింది. ఇక నగరాలతో సంబంధం మాత్రం వారికి సాధ్యమయింది. కాని ఇందువల్ల కలిగిన ప్రయోజనమేమీ లేదు. ఒకవేళ కలిగినా చాలా కొద్ది. అయితే ఉన్నతవర్గాలు తెచ్చిన విప్లవం, వారికి నగరాలతోను రైతాంగంతోను (ముఖ్యంగా రైతాంగంతో) సంబంధం ఉన్నప్పుడే, విజయం పొందుతుంది. మొత్తంలో విషాద ఘట్టం ఇదే ననుకుంటాను. వారికి అలా రైతాంగంతో సంబంధం పెట్టుకోడం సాధ్యం కాకపోయింది. కనుక ఉన్నత వర్గాలు అవలంబించిన విధానం చాలా సంకుచితమైనదై వుండాలని తేటతెల్లమవుతుంది. అందువల్లనే ఆ నాయకత్వానికి వ్యతిరేకంగా రైతులందరూ తిరుగబడ్డారు: అంతటితో జాతి పతనం కాక తప్పలేదు.

సికింజెన్‌కు ఏదోవిధంగా రైతులతో సంబంధం ఉన్నట్లు మీరు ఊహించింది చారిత్రకంగా ఎంతవరకు సత్యం? అనే విషయం చర్చించడం నా ఉద్దేశంకాదు. అసలుసమస్యకూడా అదికాదు. నాకు గురున్నంతవరకు రైతులను ప్రబోధించే 'హట్టన్' రచనల్లో కూడా ఉన్నతవర్గాల విషయం వచ్చినప్పుడు చల్లగా దాన్ని తప్పించి రైతుల క్రోధాన్నంతటిని మఠాధిపతుల వైపుకు త్రిప్పడానికి ప్రయత్నాలు జరిగాయి. సికింజెనూ హట్టనూ రైతాంగంయొక్క స్వాతంత్ర్యాన్ని కోరే రాజకీయ వేత్తలని మీరు పరిగణించడంమీద నేను, ఎలాగైనా, తప్పుపట్టడం లేదు. కాని, వెంటనే రైతాంగపు స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకించి నిలబడే ఉన్నత వర్గాలకూ రైతాంగానికీ మధ్య సికింజెను హట్టను ఉన్నట్లు ఒక ఘోరమైన వైరుధ్యం చూపవలసి వచ్చింది.

చారిత్రకంగా అవసరమైన విషయానికి ప్రత్యక్షంగా దాన్ని సాధించడంలో వచ్చే అసాధ్యానికీ ఇందువల్లనే తీవ్ర

మైన వైరుధ్యం ఏర్పడుతుంది. ఈసమస్యను వదిలేసి, మీరు ఈవిషాద సంఘర్షణను అంతకంతకూ తేలగొట్టారు పికింజెన్, సామ్రాట్టుకూ సామ్రాజ్యానికీ వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించడానికి బయలు, (ఇక్కడ మీరు రైతుల్లో చూపినట్లు సరైన చైతన్యంతో అయినప్పటికీ) ఒకానొక సామంతుడి మీద మాత్రమే యుద్ధం ప్రకటిస్తాడు. తర్వాత, మీరు తేలికగా చూపినట్లు, అతను ఉన్నత వర్గాల ఔదాసీన్యం వల్లా, పిరికితనంవల్లా మరణిస్తాడు. కాని, ఇదే మీరు, అంతకు ముందు వచ్చిన రైతు ఉద్యమాలు, రైతుల్లో ప్రజ్వరిల్లుతున్న క్రోధాగ్ని,— వీటిని చిత్రించి నట్లయితే, ఉన్నత వర్గాల వారు ఎలా రైతులకు వ్యతిరేకంగా కరడు కట్టిపోయి, ఔదాసీన్యం, పిరికితనం చూపారో స్పష్టంగా తేలి పోయేది. కథకు మరో స్వరూపంవచ్చేది రైతుల పేదప్రజల ఉద్యమాన్ని నాటకంలో ఇముడ్చడానికి ఇది ఒక మార్గం మాత్రమే. ఇలాంటిని ఇంకా అనేకం వున్నాయి

నేను మీపుస్తకాన్ని కళాదృష్టిలోను, చారిత్రకంగాను సవిమర్శకంగా చూశానని మీకు తెలుసు అలా చూసినప్పుడు మాత్రమే నేనేమైనా ఆక్షేపణలు చెప్పగలుగుదుననేదే. నేను మీ నాటకాన్ని శ్రద్ధగా చూసినట్లు నిదర్శనం మన పరస్పర విమర్శ పార్టీ దృష్టిలో సాధ్యమైనంత వరకు విప్లవపాతంగానే ఉంటూ వచ్చింది పార్టీ ప్రవేశించిన ఏ రంగంలోనైనా సరే, అది తన ప్రత్యేకత చూపగలగడం ముదావహం ఈ సారికూడా మీ నాటకం అలాంటి ప్రత్యేకతనే ఋజువు చేస్తున్నది.



# భస్మాసురుడు

**శ్రీమతి ' మణిమాల '**

అది డిస్ట్రిక్టు జడ్జిగారిల్లు. రిటైర్డు అయి సిటీలో పెద్దభవనం కట్టించుకొన్నాడు. చుట్టూ పెద్ద ఆవరణం. పలు వన్నెల పూలచెట్లు. క్రోటన్సు. ఆవరణంమధ్య పారిజాత చెట్టు ప్రక్కనే పాలగచ్చుఅరుగు. పద్మిని పరధ్యానంలో కూర్చొంది. అష్టమీచంద్రుడు మబ్బు ముసుగులో పయనం సాగిస్తున్నాడు భావపరంపరల్లో కొట్టుకు పోతూన్నది. పద్మిని. చెవిలో తటాలున మామగారి మాటలు గింగురుమన్నాయి. "నువ్వు వాణ్ని చూట్టానికివెళ్ళకూడదు. ఈమాటు వానికి బుద్ధిరావాలి! తప్పక వస్తుంది కూడాను. ఏం అమ్మాయీ మాటాడవా....పట్టుబట్టావా ... పుట్టింటి కెళ్ళాల్సిందే నువ్వు కూడాను. బారిస్టర్ అవుతాడని అబ్బ! ఎంత సొమ్ము తగలెట్టేశా "

"పుట్టింటి కెందు కెళ్తానండీ! మెట్టినింటిలో వుండక. ఇదినాయిల్లుగాదూ"

"అన్నీ నా స్వార్జితం గుర్తుంచుకో! ఈనిమిషందాకా నే పెట్టాల్సిందేనా మీకు. మీ ఇద్దరికీ హక్కు అన్నమాటలేదు. ఇంకపిల్లలకా... ఇప్పుడెందు కామాటలు ....నీవు వెళ్ళటానికి వీల్లేదు, "అంటూ గ్రామానికి వెళ్ళిపోయాడు మామ.

"అబ్బ! ఎంత పరాధీనం! అయితేనేం! వెళ్ళకమానను!" అనుకొంటూ కళ్ళు తుడుచుకొంటున్నది. "అమ్మా! అమ్మా" అంటూ పరుగెత్తుకొచ్చింది ఉష చటుక్కున ఉషను ఒళ్ళో కూర్చొబెట్టుకొని ముద్దుపెట్టుకొంది.

"నేను గెలిచా, ఒరే రవి! అమ్మను ముట్టేసుకొన్నా"నంటూ ఆనందంతో చేతులు తట్టింది ఉష. ఉషను తరుముకొచ్చిన రవి ప్రభలు తల్లి ముఖాన్ని తేరిచూదారు. ఇరు ప్రక్కలా తల్లి భుజాన్ని ఆనుకొని కూర్చున్నారు. "అమ్మా కథచెప్పవూ మాటిచ్చావు గదూ!... ఊఁ చెప్పుమరి" అంటూ ఉష, తల్లి గడ్డం పట్టుకొని ప్రాధేయపడింది. ఇంతలో గేటు తెరిచిన చప్పుడు. "అమ్మా! ఎవరో వచ్చారే" అంటూ రవి చెంగున దుమికి పరుగెత్తాడు. "ఉషా, ఇప్పుడేవచ్చి చెప్పుతా ఏం .."అంటూ పద్మిని ఇంటి వసారా వద్దకు వచ్చింది.

"పద్మినీదేవిగారూ! నమస్కారం"

"ఓ .. ... చౌదరన్నయ్యగారా! నమస్కారం, రండి" అంటూ పద్మిని వసారాలో కుర్చీ వేసింది ... "ఎప్పుడొచ్చారండీ ఈఊరు?"

"ఈ రోజే! శ్రీ ధర్ ఇంకనూ రాలేదూ!"

"ఇక్కడ ఉంటేగా ఇంటికి రావటానికి"

"నాకేమీ బోధపడలేదండీ!"

"మీ మిత్రుడు ప్రభుత్వ ఆతిధ్యంలో ఉన్నాగండీ! 3 నెలలు కావచ్చాయి "

"ప్రభుత్వం ఆతిధ్యంలోనే .. ?!"

రవి, ప్రభలు ఏమీ మాట్లాడలేదు కాని ఉష తల్లి ముఖాన్నిచూచి చౌదరి ముఖాన్ని చూచింది "లేదు మామయ్యా! అమ్మ అబద్ధమాడింది. నాన్నను జైలుకి పట్టుకుపొయ్యారు" అని బిక్కమొగం పెట్టుకొంది. పద్మిని కళ్లు చెమ్మగిల్లాయి "చిట్టీ! ఎంతఅమాయకురాలివే? అమ్మ అబద్ధం ఆడిందికదూ?" అంటూ ఆమె ఉషను దగ్గరకు తీసుకొని చిరునవ్వు నవ్వింది చౌదరీగారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

* * *

"అమ్మా!....ఎందుకే అలా ఉన్నావు ..."అన్నది ఉష, "ఎలా ఉన్నా చిట్టీ!" అందితల్లి. "అలా అంటే అసలు అర్థ మేమో చెప్పుచూద్దాం" అన్నాడు రవి.

"అమ్మ అబద్ధ మాడిందన్నావే! నీ కేమో మహా తెలిసినట్టు." అంది ప్రభ. ఉష తల్లి కుచ్చెళ్లతో తల దాచు కొంది. వెక్కి-వెక్కి ఏడ్చింది. "నా బంగారు కొండవు కదూ! రా చిట్టీ! నీకు మంచి కధ చెప్పుతా" అని పద్మిని ఉషను ఎత్తుకొని కన్నీళ్ళు తుడుస్తూ "ఒరే రవీ! ప్రభా! చెల్లిని ఏడ్పించారు గదూ, మీకు సిగ్గులేదూ.........ఇదిగో చూడండి! ఉషను ఏడిపించినందుకు మీ కేమిశిక్షో తెలుసా? నా ముద్దుల చిట్టికి మాత్రం మంచి కధ చెప్పుతా. మీ రిద్దరూ వెళ్ళిపోవాలి. యు ఆర్ ఎక్స్‌పెల్డు(You are expelled) ఊం వెళ్ళండి" అని ఏమో సౌజ్ఞ చేసింది తల్లి చిట్టి చేతులతో తల్లి కుచ్చెళు పట్టుకొని రవి, ప్రభల ముఖాన్నిచూచి మురిసిపోయింది ఉష శిక్షను శిరసా వహిస్తామన్నట్టు తలలు వంచుకొని రవి ప్రభలు వెళ్ళిపోయారు.

"చిట్టీ ఏంకధ చెప్పాలి?"

"భస్మాసుర వరం చెప్పుతానన్నావు కదూ అదే చెప్పు" అంది ఉష.

"అయితే విను .. ఇహ అన్నయ్యకు అక్కయ్యకూ శిక్ష చాలుగదూ? వాళ్లని కూడా రమ్మంటావూ?"

లేడిపిల్లలా చెంగున గంతువేసి "అక్కయ్యా! అన్నయ్యా!" అని ఎలు గెత్తి పిలిచింది ఉష దాపునే చెట్లక్రింద దాక్కొన్న ఇద్దరూ బయటికి వచ్చారు. "అమ్మ! దొంగా" అని చేతులు తట్టుతూ తల్లివద్దకు పరుగెత్తుకొచ్చింది ఉష తన ప్రక్కనే కూర్చొమ్మని ఆదేశించింది.

"అమ్మా! నీ పుక్కిటి పురాణకథలు మాకు వద్దు నిజమైన కధ చెప్పు, కదూ! ఉషా" అన్నాడు రవి.

"అవునే అమ్మా! నిజం కధ చెప్పు" అన్నది గంభీరంగా ఉష.

"నిజంగా నువ్వు కోతివే. అన్న య్యను ఎంతబాగ అనుకరిస్తావే.... ... రవీ! నేను పురాణవ్యక్తిని కాదటోయి? అందుకనే పురాణకధల్ని చెప్పుతానంట కాని, ఇది పాత భస్మాసుర కధ కాదు. ఆధునిక .." అని తల్లి అంటుంటే, అడ్డువచ్చి ప్రభ "అయితే చాల తమా షాగా వుంటుంది. అమ్మా ఇక మొదలు పెట్టు" అంది ఉవ్విళ్ళూరుతూ.

తల్లి మొదలెట్టింది :

"నేను చిట్టిలాగు చిన్నపిల్లగా ఉన్నప్పుడు ఒక గొప్ప ఉద్యోగి ఉండేవాడు. అతని పేరు విశ్వేశ్వరరావు. అతనంటే మా నాన్నగారికి అమిత గౌరవం.

"అతని ఐశ్వర్యాన్ని హోదాను గురించీ అందరూ మాట్లాడుకునేవారు. భోగలాలసుడు అనేవారు. కొంత కాలానికి అతడు దేశభక్తు డయ్యాడు. తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాడు. సర్వసంగ పరిత్యాగి అయ్యాడు. అంతే ఐశ్వర్యాన్ని దేశ సేవకు అర్పించి వేశాడు. పంచాగ్నులమధ్య ఒక్క కాలి మీద నిలబడి దినాలు నెలలు ఏళ్ళకొలది తపస్సు చేశాడు...." "అమ్మా! మరి ఏదో తపస్సు పంచాగ్నులు తెచ్చావే" అన్నాడురవి. "పంచాంగులంటేఏమమ్మా" అని అడిగింది ఉష. "పంచాగ్నులు అని ఎందుకనిందో అమ్మ అంత మాత్రం ఊహించుకో లేవూ: అన్ని కష్టాలు పడ్డాడు. దేశసేవ చేశాడు.... అన్నమాట." అంది ప్రభ.

మళ్ళీ తల్లి అందుకుంది. "ప్రభ ఎంత బాగా ఊహించింది. ఆ దేశభక్తుడు, దాస్యం, దారిద్ర్యం లాఠీచార్జీలు, జుల్మానాలు, కారాగృహ వాసం అనే పంచాగ్నుల మధ్య ఘోర తపస్సు చేశాడు. అతని తపస్సు పండింది. ప్రజల అనురాగాన్ని పొందాడు. గొప్ప పదవి నలంకరించాడు. అతని ఇష్ట దైవం వరమిచ్చింది అంటే ప్రజాకోటి వరమిచ్చిందన్నమాట. రవీ ... బోధ పడిందీ? ...

"దేశభక్తునికి జై! దేశబంధుకు జై! అని దేశమంతటా మారుమ్రోగింది.. మరుక్షణంలోనే. దేశబంధు హృదయంలో మహత్తరమైన మార్పు ఒకటి కలిగింది. ముఖంలో ఒక మార్పు! ఆలోచనలో ఒకమార్పు! మాటధోరణిలో ఒకమార్పు! ప్రవర్తనలో ఒక మార్పు! మార్పు! మార్పు! నిలువెల్లా మార్పు! భూమ్యాకాశమంత పెరిగిపోయాడు. సింహంలాగు గర్జించాడు. కళ్ళల్లో ఒకవింత జ్యోతి. నడకలో ఒకవింతధోరణి అతని అడుగులకు ఎడుగులొత్తే అనుచరులు అసంఖ్యాకులయిపోయారు. భూత, ప్రేత, పిశాచ, ఢాకినీ గాలి దయ్యాల పరివారంతో పరివేష్టింపబడ్డాడు. భోగభాగ్యలాలసుడై అంతరిక్షంలో పుష్ప విమానంలో విహరించసాగాడు. దీన జనుల రక్తాన్ని పీల్చి పిప్పిచేసి ఆకలిని తీర్చుకొమ్మని దయ్యాలకూ, భూతాలకూ అనుజ్ఞ యిచ్చాడు. అడ్డువచ్చిన వారిని పట్టి పీటాడమన్నాడు. "అబ్బ! నాటి దేశభక్తుడు నేడు దేశకంటకుడయ్యాడు! నాటి దేశబంధువు నేటి రాబందు అయ్యాడు" అనేఘోష బయలుదేరింది. కరువు రాటకాలు తల విరియబోసుకొని విచ్చలవిడిగా చిందులు త్రొక్కసాగాయి. పేదల ఆర్తనాదం మిన్నుముట్టింది. "అనాథుల రక్షించు! వారు నీ అనుంగు సోదరులు" అని అశరీరవాణి పలికింది. దీనబంధువులు తండోపతండాలుగా బయలుదేరారు. దీనులను రక్షించ దీక్ష వహించారు.

"అదిగో అర్ధరాత్రిలో వజ్రాయుధాన్ని ఝళిపించాడు దేశకంటకుడు. తెల తెలవారకముందే పైశాచిక భటులు బయలు

దేరారు. దేశభక్తుల్ని. దీన రక్షకుల్ని చెరబట్టి తీసుకెళ్ళారు ..."

"అబ్బ! భయంవేస్తున్నదే" అన్నది ఉష.

"అమ్మా! యశోద అన్నయ్యనూ పట్టుకుపొయ్యారే" అన్నది ప్రభ

"రఘు నాన్నను తీసికెళ్ళారే" అన్నాడు రవి.

"ఇంతలో పదవీ గర్భంనుండి మోహిని ఉద్భవించింది. భస్మాసురుడు భస్మమైపోతాడన్న పాటకు నృత్యం చేయసాగింది. భూతప్రేత పిశాచాలతో నవీన భస్మాసురుడు .. "

"అమ్మా! వద్దే. నాకు భయం వేస్తుంది" అని గట్టిగా కళ్ళుమూసుకొంది ఉష.

"అవునే! అమ్మా నాకు కూడా," అన్నారు రవి....ప్రభ.

"ఏం భయంలేదు. తన నెత్తినే తనచెయ్యి పెట్టుకొని భస్మమైనాడు భస్మాసురుడు" అన్నది తల్లి ఓదార్పుగా.

"అమ్మా. మళ్ళీ భస్మాసురుళ్ళు పుట్టరుగదా ?" అని రవి, దీర్ఘంగా ఆలోచిస్తున్న వాడిలాగా అడిగాడు,

"చస్తే. ఇంకా పుట్టేదేమిటి ?" అని ఉష నిబ్బరంగా జవాబుచెప్పి, తల్లి ఒళ్లోదూరి, గెలిచినట్లు, కిలకిలా నవ్వింది.



# వార్తలు పంపండి!



మనం ప్రతి పట్నంలోను అనేక సభలూ సమావేశాలూ జరుపుతున్నాం. కవితా గోష్ఠులూ చర్చలూ నిర్వహిస్తున్నాం. వర్ధంతి సభలు జరిపి. ఆంధ్ర మహాపురుషుల ఉత్తమ సందేశాలను ఆంధ్రప్రజానీకానికి అందజేస్తున్నాం. మన కార్యక్రమంద్వారా ఆంధ్ర సాహితీ కళా రంగల్లో నూతన చైతన్యం కలిగిస్తున్నాం.

కాని మనం ఇంత పట్టుదలతోను, ప్రతిభతోను నిర్వహిస్తున్న ఏ సభను గూర్చి ఇంత వరకూ సమగ్రమైన వార్తలు పంపడం మాత్రం నేర్చుకోలేదు. ఎక్కడెక్కడ మన కళా రంగాల్లో ఏఏ సంఘటనలు జరిగిందీ ప్రజలందరికీ తెలియ జేయవలసిన బాధ్యత మన మీద వుంది. ఎక్కడ ఏ సభ జరిగినా దాన్ని గురించి మనంవివరంగా ఆ సభావిశిష్టతను తెలియ జేసేదిగా సమగ్రమైన వార్త ప్రచురించాలి. ఇలా వివిధ ప్రాంతాలలోని కళా కలాపాలను గూర్చి ఆంధ్ర ప్రజానీకానికి తెలియజేసినప్పుడే మన ఉద్యమాన్నిగురించి ఒక స్పష్టమైన దృక్పథం ఏర్పరచగలుగుతాం. మన కళా సాహిత్యాలకు ప్రజల ఆదరాభిమానాలు పొందగలుగుతాం. కనుక అన్ని స్థానికసంఘాల బాధ్యులూ తమ తమ ప్రాంతాల్లో జరిగే అన్ని సాహిత్య సభలనుగూర్చి సమగ్రమైన వార్తలు పంపాలని కోరుతున్నాం. ఎవరెవరు సభలో పాల్గొన్నదీ, ఏఏ విషయాలనుగూర్చి ఏమేమి చెప్పిందీ, అభ్యుదయ దృక్పథంలో ఆ సభా ప్రాముఖ్యం ఏమైనదీ స్పష్టంగా వివరాలతో సహా వార్తలు పంపాలి. ఒక ప్రత్యేక సంపాదకీయ శీర్షికక్రింద 'అభ్యుదయ'లో ఈ వార్తలన్నీ ప్రచురిస్తాం. ప్రతినెలా 25 వ తేదీ లోపుగా మీరు పంపే వార్తలన్నీ అభ్యుదయ కార్యాలయానికి చేరేలాగా చూడండి.

బెజవాడ
6-7-1947

చదలవాడ పిచ్చయ్య
కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం

# అనిర్దేశ్య సిద్ధాంతం

శ్రీ డి. ఎ. ఎ. ఎస్. నారాయణరావు

ప్రస్తుత శతాబ్దపు మూడవదశ పదార్థ విజ్ఞానశాస్త్ర సిద్ధాంతములలో అఖండమైన అభివృద్ధికి దారితీసింది. పదార్థం యొక్క తత్వమును గురించిన అభిప్రాయాలలో పెద్ద మార్పు వచ్చింది 1927 లో హైజన్‌బర్గ్ అను జర్మను శాస్త్రజ్ఞుడు అనిర్దేశ్య సిద్ధాంతము (Principle of Indeterminacy or Uncertainty) ను ప్రతిపాదించాడు. అది విప్లవకరమైన అభిప్రాయాలను సూచిస్తూ శాస్త్రజ్ఞులనూ, తత్వజ్ఞులనూ ఎక్కువగా కదిపింది.

17 వ శతాబ్దంలో యంత్రశాస్త్రము (mechanics) స్థాపింపబడింది చలన సూత్రాలు (Laws of motion) ప్రతిపాదింపబడ్డాయి. పదార్థంలోని ఒక కణం ఒక క్షణమందు ఏ వేగంతో కదులుతూందో, ఏ స్థానంలో ఉందో తెలిస్తే ఆ సూత్రాలప్రకారం అది ఇంకో నిర్ణీత క్షణమందు ఏ వేగం కలిగి వుంటుందో, ఏ స్థలంలో ఉంటుందో మొదలగునవి తూ. చా. తప్పకుండా తెలిసికొనవచ్చును. మామూలు పదార్థాలు ఈ సూత్రాల నెలాగ అనుసరిస్తున్నాయో ప్రాయోగికం (experimental) గా ఋజువు చేయబడింది. సూర్యునిచుట్టూ తిరుగుతున్న గ్రహాలు, భూమిమీదనున్న చిన్న వస్తువులు అన్నీకూడా అవే సూత్రాల ననుసరిస్తున్నాయని తెలిసింది. కనుక ఆ సూత్రాలు విశ్వవ్యాపితమైన వని గ్రహింపబడింది. ఏ కణంయొక్కగాని ప్రస్తుత స్థానం, వేగం తెలిసినట్లయితే చలన సూత్రాలద్వారా ఇతర క్షణాలలో నెప్పుడైనా దానిస్థానం వేగం ఎంతఉంటాయో సూచింపవచ్చు అనగా అవి నిశ్చయమైపోయి ఉన్నాయి తగిన జ్ఞానమున్నచో వానిని మనము ముందుగానే తెలుసుకోవచ్చును. కొన్ని కణాల సమూహం [system of particles] ఉన్నదనుకోండి అందులోనే వేరువేరు కణాల స్థానాలు వేగాలు ఏ క్షణమందైనా తెలిస్తే ఇతర క్షణాలలో వాని స్థానాలు వేగాలుసిద్ధాంతరీత్యానిర్ణయించవచ్చును. కనుక ఇతర క్షణాలలో ఆ సమూహం ఉండే స్థితిని తూ చా తప్పకుండా తెలిసికొనవచ్చును దాని స్థితిని భూతకాలంలోను, భవిష్యత్తులోనుకూడా సూచింపవచ్చును. ఈ అభిప్రాయాన్నే పదార్థ విజ్ఞానశాస్త్రంలోని నిర్ణయత్వం (determinism) అంటారు.

పై నిర్ణయత్వపు అభిప్రాయాన్ని విశ్వాని కంతటికీ పూర్తిగా అన్వయం చేసి, విశ్వంగురించినఒక అభిప్రాయానికి దారి తీసినవాడు లాప్లాస్ శాస్త్రజ్ఞుడు. విశ్వమంతా పరమాణువుల సమూహం గదా. విశ్వంలోని ప్రతి విషయం పర

మాణువుల ఏర్పాటుమీదనే ఆధారపడి ఉంటుంది. "శాస్త్ర పద్ధతులు వృద్ధి పొంది ఏ క్షణంలోకాని విశ్వంలోని పరమాణువు లన్నిటియొక్క స్థానాల వేగాలు తెలిసినట్లయితే ఇతరక్షణా లన్నిటిలోను (భూతకాలంలోను, భవిష్యత్ కాలంలోను) ఆ పరమాణువు లన్నిటియొక్క స్థానాలు వేగాలు భౌతిక శాస్త్రంలోని చలనసూత్రాల ప్రకారం తూ. చా. తప్పకుండా తెలిసికొని చెప్పవచ్చును. విశ్వంయొక్క స్థితి దానిలోని పరమాణువుల ఏర్పాటు పైన ఆధారపడి ఉంటుంది కనుక విశ్వంయొక్క స్థితి సర్వకాలములయందు ఎలాగుంటుందో ఒక్కమారుగా తెలిసికొన వచ్చును" అని లాప్లాస్ శాస్త్రజ్ఞుడు చెప్పేడు. విశ్వంయొక్క స్థితిని మనము ముందుగనే తెలిసికొన గలమంటే అది ముందుగనే నిర్ణయింప బడిపోయిన దన్నమాట కనుక ఈ తత్వం ప్రకారం విశ్వంయొక్క గతి అంతా ఏనాడో (సృష్టి ఆదిలోనే) నిర్ణయింపబడి పోయిన దన్నమాట. అందులోని పరమాణువుల నన్నిటి గురించిన జ్ఞానమున్నచో మనమాగతిని ముందుగనే తెలిసికొన వచ్చును. ఈతత్వాన్ని యాంత్రిక భౌతిక వాదము (mechanist materialism) అంటారు.

18, 19 శతాబ్దాలలో ఈ తత్వం శాస్త్రజ్ఞు లందరిని ఎక్కువగా ఆకర్షించింది. ఆచరణలో నిజంగా అన్ని పరమాణువుల స్థానవేగాన్ని తెలిసికో గలిగినా తెలిసి కోలేక పోయినా, సిద్ధాంత రీత్యా అవి తెలిసికొనబడ గలిగినవి. పరమాణువుల చలనం వాని మూలంగా విశ్వంయొక్క గతి అంతా నిర్ణయ పద్ధతులలో కొన్ని సూత్రాల ప్రకారం జరుగుతూ ఉంటాయి ఒక యంత్రం ఎలాగ నడుస్తుందో ఈ విశ్వం అలాగే నడుస్తుంది.

ఇదివరకు శాస్త్రజ్ఞులు విశ్వంలోని మూలకణాలు ఇలాగ నిర్ణయమైన స్థానాలు వేగాలు కలిగి ఉంటాయి వానిని తెలిసికొనవచ్చు నన్నారు కాని హైజనుబర్గు ఈ ఊహ సరియైనది కాదన్నాడు. అతని అనిర్దేశ్య సిద్ధాంతం ప్రకారం, ఒక కణంయొక్క స్థానంవేగం రెండూ ఒకేమారు నిర్ణయంగా ఉండవు ఒక ఎలక్ట్రానువంటి చిన్నకణం ఒక ప్రత్యేక స్థానంలో ఉందిఅంటే దానికి నిర్ణయమైన వేగం ఉండదు, ఆవేగం కొంత హద్దుల్లో ఎంతైనా ఉండవచ్చును. మనము దానిని సుమారుగా తెలిసికో వచ్చును కాని తూ. చా, తప్పకుండా తెలిసికోలేము. లేక అది ప్రత్యేక వేగం కలిగిఉంది అంటే దానికి నిర్ణయ మైన స్థానంలేదు. ఆక్షణంలో అది కొంత హద్దుల్లో ఎక్కడైనా ఉండ వచ్చును. మనము దాని స్థానాన్ని సుమారుగా తెలిసికో వచ్చును గాని తూ చా తప్పకుండా తెలిసికోలేము. ఇలాగ ప్రకృతిలోని మూలకణాలైన ఎలక్ట్రాను వంటి కణాలకి నిర్ణయమైన స్థానవేగాలు రెండు ఒకేమారు ఉండవనీ, వాటిని మనం తూ. చా తప్పకుండా తెలిసికోలేమనీ, సుమారుగా మాత్రమే తెలిసికోగల మనీ హైజనుబర్గు చెప్పేడు.

విశ్వంలోని మూలకణాల ప్రస్తుత

స్థితిని తెలిసి కొన్నట్లయితే చలన సూత్రముల ప్రకారం భవిష్యత్ స్థితిని నిర్ణయించి చెప్పవచ్చును అనేది నిర్ణయత్వ సిద్ధాంతము. ప్రస్తుత స్థితిని పూర్తిగా తెలిసికొన గలమనేదే దానికి పునాది. కాని అనిర్దేశ్య సిద్ధాంతము మూలకణంయొక్క ప్రస్తుతస్థితి నిర్ణయంగా ఉండదనీ దానిని తెలిసికొన లేమనీ చెపుతూ నిర్ణయత్వం యొక్క పునాదిని త్రోసివేసింది దానితో శాస్త్రము లోని నిర్ణయత్వపు అభిప్రాయాల మీద అందరికీ అనుమానాలు కలిగేయి. అవి కూలి పోయేయి. యాంత్రిక భౌతిక వాదం శాస్త్రజ్ఞులఅసమ్మతికిపాలయింది. విశ్వము యొక్క మూలకణాలలోనే ఏక్షణంలోనూ లేని నిర్ణయత్వం విశ్వం యొక్క గతిలో ఎక్కడుంటుంది? విశ్వంయొక్క గతి కొన్ని సూత్రాల పైనగాక ఛాన్సుమీద ఆధారపడిఉంటుం దన్నారు తత్వజ్ఞులు కొందరు.

అయితే పై సిద్ధాంతం యొక్క అంతరార్థాన్ని గుర్తించడంలో మనం కొంత జాగ్రత్తపడాలి. ఎలక్ట్రానులవంటి సూక్ష్మకణాల విషయంలో ఏ ఒక్కదాని గురించి నిర్ణయం తెలిసికొనలేము వాటికి నిర్ణయత్వపు పద్ధతులను అన్వయింపలేము. కాని సూక్ష్మ కణముల సముదాయమగు పెద్దవస్తువులకి నిర్ణయత్వపు పద్ధతులను అన్వయించగలుగుతున్నాము. ఒకరాయిని కొంత వేగంతో విసిరినప్పుడు అది యింకొక క్షణంలో ఎంత వేగంతో ఏ స్థలంలో ఉంటుందో చెప్పగలుగుతున్నాము రాయిపడుతున్న దారిలో బుట్టపెట్టి, "దాని గతి ఛాన్సువలన నిర్ణయింపబడుతుంది. అది ఏ మార్గంలోనైనా ప్రయాణం చేయ వచ్చును. ఇదే మార్గంలో వస్తుంది అన్న నిర్ణయంలేదు" అనుకుంటున్నా, అది వచ్చి బుట్టకు కన్నంపెట్టకమానదు. కనుక ఒక వ్యక్తిగతమైన ఎలక్ట్రాను గతిలో నిర్ణయత్వము లేదుగదా అని ఎలక్ట్రానుల సమూహానికి, విశ్వానికి క్రమపద్ధతి లేదనే అభిప్రాయానికి రాకూడదు. సూక్ష్మకణ సముదాయ ప్రవర్తనలో (Statistical behavior) క్రమగతి ఉంది దానిని ముందుగనే మనము తెలిసికొన గలుగుతున్నాము అనిర్దేశ్య సిద్ధాంతానికి దారితీసిన నూతన క్వాంటం యంత్రశాస్త్రమే కణ సముదాయాల ప్రవర్తనను సూచిస్తుంది. ఆ కణ సముదాయాల ప్రవర్తనలో గల సూత్రాలను కనుగొన్నది: నూతన క్వాంటం యంత్ర శాస్త్రంలోని సూత్రాలు వ్యక్తిగత కణములకుగాక కణ సముదాయాల ప్రవర్తనకు చెందినవి. ఆధునిక శాస్త్రం వలన కణసముదాయం ప్రవర్తన నిర్ణయమైనది దానిని తెలిసికొనవచ్చును అని తెలుస్తూంది.

ఈ సిద్ధాంతంతో విశ్వంలోని విచిత్ర విషయ మొకటి బయటపడింది వ్యక్తిగత కణాల్లో నిర్ణయత్వం క్రమపద్ధతీ లేకపోయినా కణసముదాయాల్లో ఆ రెండూ ఉన్నాయి. శాస్త్రం బయల్పరచిన ఈ విషయాన్ని పూర్తిగా గ్రహించకుండా మూలకణాలలో నిర్ణయత్వం లేదన్న సంగతిని మాత్రమే గ్రహించి, వానిలో లేని నిర్ణయత్వం విశ్వంలో మటుకు ఎక్కడుంటుంది అని త్రోసి

పుచ్చేవారు తమ్ము తాము మోసపుచ్చు కుంటున్నారన్నమాటగాని ప్రకృతి రహస్యాలను గ్రహించడంలేదు.

క్రిందటి శతాబ్దములో మార్క్స్, ఎంగెల్సులు చెప్పిన విషయమొకటి ఈ శతాబ్దంలో శాస్త్రజ్ఞానంలో వచ్చిన ఈ కొత్త అభిప్రాయం పోలిక గలిగి వున్నాయి. మార్క్స్, ఎంగెల్సుల సిద్ధాంతం ప్రకారం ఒక వ్యక్తియొక్క జీవితములో ఛాన్సుయొక్క పాత్ర ఎక్కువగా ఉండి అది అనిర్ణయమైనప్పటికీ, సమాజంయొక్క చరిత్ర నిర్ణయమైనది; అది కొన్ని సూత్రాల ప్రకారం నడుస్తుంది, దానిని తెలిసికొనగలము. ఒక ఎలక్ట్రానుగతి అనిర్దేశ్యమైనాకూడా ఎలక్ట్రాను సమూహంగతి ఏలాగు నిర్ణయమైనదో ఒకమానవుని వ్యక్తిగతజీవితం ఎంత అనిర్దేశ్యమైనా, మానవ సమాజం చరిత్ర నిర్ణయమైన క్రమమైన పద్ధతిలో పోతూందని తెలుస్తూంది.

మార్క్స్, ఎంగెల్సుల తత్వదృష్టి ప్రకారం ఒక కణంలోలేని గుణాలు సమూహంలో రావచ్చును. కణంలోలేని నిర్ణయత్వం కణసముదాయంలో రావడం ఈ అభిప్రాయానికి అనుగుణ్యంగా ఉంది.

అనిర్దేశ్య సిద్ధాంతం వ్యక్తిగతమైన సూక్ష్మకణాలగతి అనిర్దేశ్యమని చెప్పి, యాంత్రిక భౌతికవాదమును త్రోసివేసిందేగాని, కణసముదాయముల ప్రవర్తనలో క్రమగతిని తెలిసికొనుట అసాధ్యమని చెప్పలేదు. పదార్థముయొక్క ప్రాముఖ్యతను భౌతికవాదమును పోగొట్టలేదు అనిర్దేశ్య సిద్ధాంతము మార్క్స్ ఎంగెల్సుల అభిప్రాయాలకి అనుగుణ్యంగాఉంది, వారి గతితార్కిక భౌతికవాదాన్ని కొంత బలపరుస్తూంది. అంతేగాని అది విశ్వంలోని నిర్ణయత్వాన్నీ క్రమపద్ధతినీ అంతా త్రోసివేసి, ఛాన్సుకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్నిచ్చిందనుకొనుట పొరపాటు.



(14 వ పేజీ తరువాయి)

వోపికతోవిన్నా. నాకతనంటే ప్రేమ లేకపోవడంవల్ల - పై పెచ్చు అతనికి తప్ప త్రాగుడు అలవాటైనందువల్ల మేమిద్దరం వేరుగా ఉండటమే ఉచితమని నాకుతోచింది. అందుకు అతనూ ఒప్పుకున్నాడు.

దేశాచారం మమ్మల్ని కృత్రిమమైన నిర్బంధ బాంధవ్యంలోపెట్టి, మాపీకలకు ఉచ్చు తగిలించింది.

చాలా ఆలోచించగా మేము గుజరాతీలమనే సంగతి స్ఫురణకొచ్చింది. బాడౌదా చట్టం ప్రకారంవిడాకులు ఇచ్చుకోవచ్చు అనుకున్నాము. అదేకనక లేకపోతే ఇక నా గతేమిటి?

# గ్రంథ సమీక్ష

## సవిత

[ శరత్ నవల ]

అనువాదం : శ్రీ సూరి

అరుణ ప్రచురణ

వెరైటీ ఏజెన్సీస్, బెజవాడ.

వెల : 3—8—0

ఆధునిక బెంగాలీ నవలా రచనలో సిద్ధహస్తుడైన శరశ్చంద్రుని చివరి రచన 'శేషేర్ పరిచయ్' ఈ నవల 'భారత వర్ష' అనే బెంగాలీ మాసపత్రికలో ప్రకటితమైంది. ఇంతలో శరశ్చంద్రుడు పరమపదించాడు. ఇలా అసంపూర్ణంగా ఉన్న నవలను, నవలాకారుని ఆత్మీయురాలైన కవయిత్రి రాధారాణీదేవి పూర్తి చేసింది.

శరశ్చంద్రుడు ధనిక మధ్యతరగతులకు చెందిన వ్యక్తుల జీవితాలను కథా వస్తువుగా గ్రహించి, అందులోని లోతుపాతులను బయటపెట్టాడు; హృదయం చచ్చిన ధనమదాంధులయొక్క, నవ నాగరికులము అనుకొని మురిసిపోయే స్వార్థపరులయొక్క అమానుష ప్రవర్తనలను నిర్భయంగా బట్టబయలుచేసి, ఆక్షేపణ తెలియజేశాడు.

శరశ్చంద్రుని నవలల్లో శ్రీకాంత, శేషప్రశ్న, పథేర్‌దాబీ, బడదీదీ, రమేర్ సుమతి, దత్తాదులు సాహితీపరులఆదరాభిమానాల్ని చూరగొన్నాయి. ఈ నవలాకారుడు తాను జీవించియుండగానే, దేవదాస్, బడదీదీ, బృహదాన్ నవలలు చలన చిత్ర జగత్తు నొక్కుమ్మడిగా ఉఱ్ఱూతలూగించేస్తూంటే కళ్ళారా చూచి ఆనందించాడు. ఇతని దత్, నిష్కృతి, శ్రీకాంత్, నవలలు ఇంగ్లీషులోనికి అనువదింపబడి ప్రశంసాపాత్రమైనాయి; ఇతని నవలల్లోకల్లా, పథేర్‌దాబీయే విప్లవాత్మకమైనది.

'శేషేర్ పరిచయ్' అనే యీ నవలలో ప్రధాన వ్యక్తి 'సవిత' అవడం చేత యీ నవలకు 'సవిత' నామకరణం సమంజసమే. ఇది, భర్తృ విసర్జిత సంఘబహిష్కృత అయిన ఒక స్త్రీ యొక్క విషాద జీవనగాథ. సవిత భర్త వయసు చెల్లిన పూర్వాచార పరాయణుడు, ఛాందస వైష్ణవభక్తుడు అతను పల్లెటూరి సంపన్న బ్రాహ్మణ కుటుంబీకుడు ప్రౌఢవయస్విని సవిత అతని రెండో పెళ్ళిభార్య. కులదైవమైన గోవిందజీ పూజాభారం వహించడానికే వ్రజబాబు రెండోపెళ్ళి చేసుకొన్నాడు. వ్రజబాబు దగ్గిర బంధువూ భోగలాలసుడూ అయిన రమణీబాబు యొక్క విషయజ్వాలలకు, యౌవన పటుత్వంలో ఉన్న సవిత ఆహుతైంది సవిత, అర్ధరాత్రి స్వగృహాన్ని తన మూడేళ్ళ ముద్దుబిడ్డ రేణుకనీ వదిలేసి రమణీ బాబుతో వెళ్ళిపోయింది. వ్రజబాబు మూడోపెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు వ్రజబాబు యింటికి అతని బావ

మరిది హేమంతబాబే యజమానీ, అత్త గారు గృహాధికారిణి అయ్యారు.

కామాతురుడైన రమణీబాబుతో సవిత పన్నెండేండ్లు గడిపింది. అతని అరుచి కరమైన మాటలన్నా, లజ్జావిహీనమైన సరసమన్నా సవితకు పరమ అసహ్యం. అతనంటే సవితకు అసహ్యమూ, విద్వేషమూ రోజు రోజుకు వృద్ధి అవుతూ వచ్చాయి. రమణీబాబు అతి అనుమానస్థుడూ, మొరటు మనిషిని. జబర్దస్తీ చేసి తన స్వార్థం నెగ్గేలా చేయగల్గిన నిరంకుశుడున్నూ. రానురాను సవితకు అతనితో కాపురం నరకకుండంగా మారిపోయింది.

ఇంతలో వ్రజబాబు హేమంతబాబు సహాపై తన రేణును కలకత్తాలో నాల్గు మేడలకు అధికారియైన ఒక వరునకిచ్చి పెళ్ళిచేసే నిమిత్తం ముహూర్తం పెట్టినట్లు తెలుసుకొని సవిత చాలా ఆదుర్దా పడ్డది. ఎందుకంటే పెళ్ళికొడుకు తాత పిచ్చెత్తి చనిపోయాడు. పెళ్ళికొడుకు పింతల్లి ఒకామెకు పిచ్చెత్తింది. ఇలాంటి అధ్వాన్నపు సంబంధం ఆపి తీరాలని అమె నిశ్చయించింది. ఇంతి దాకా నిగూఢమై అమె హృదయంలో అంత ర్లీనమై ఉండిపోయిన మాతృత్వం అంతా ఒక్కుమ్మడిగా ఉబ్బెత్తున ఉప్పొంగిపోయింది.

సవిత వ్రజబాబుతో కాపురం చేస్తున్నప్పుడు తాను పోషించి పెంచిన అభిమాన పుత్రుడు రాఖల్‌బాబు, అతని ప్రాణ మిత్రుడైన తారకబాబుల సలహా ప్రకారం అమె వ్రజబాబుతో ముఖాముఖిగా వాదించి తన కూతురు పెళ్ళిని ఆపగలిగింది.

బావమరిది అన్యాయం చేయడంచేత వ్యాపారంలో దెబ్బతిన్న వ్రజబాబు అప్పులపాలు అయినాడు. ఇల్లూ, వాకిలీ అప్పులవాళ్లు కట్టుకపోయారు. వ్రజబాబు మూడవ భార్య సగం ఆస్తి పంచుకొని తన చంటిపిల్లతోసహా హేమంతబాబు వెంట పుట్టింటికి వెళ్లిపోయింది. కటిక బీదరికం అనుభవిస్తూ తండ్రీ, కూతురూ ఒక యిరుకైన యింట్లో కష్టంమీద బ్రతుకుతున్నారు అతి ఛాందసుడైన వ్రజబాబు చేసుకోలేక చేసుకోలేక వంట చేసుకొని తింటున్నాడు. రాఖాల్‌బాబు వాళ్ళ యింటికి తరుచుగా వెళ్ళి మడితో వంట చేసిపెట్టి, వాళ్ళకి చాలా సహాయంగా ఉంటున్నాడు. ఈ పరిస్థితుల్లో రేణుకు విషజ్వరం తగిలింది. చాలా రోజులవరకు ఆ అమ్మాయి ప్రమాదావస్థలో వుంది మందు ఖర్చులైనా ఇచ్చుకొనేందుకు చిల్లిగవ్వకూడా లేదాయెను. రాఖాల్‌బాబు ఆవేదనా భారంతో క్రుంగిపోయాడు. రాఖాల్ చివరకు స్వంత బంగారపు రిస్టువాచిని కుదువబెట్టి వందరూపాయలు తీసుకొని వెళ్ళి రేణుకు సక్రమమైన చికిత్సచేయించి అమె ప్రాణం నిలబెట్టాడు

తన సింగపూరు పార్ట్నరూ, విదేశ వ్యాపారంలో అధిక లాభాలుగడించిన కోటీశ్వరుడూ అయిన విమలబాబు కలకత్తా వచ్చాడని రమణీబాబు గొప్ప విందు ఏర్పాటుచేశాడు. మాలతీమాల గానంతో విందు కోలాహలంగా సాగిపోతోంది. అతిథిసత్కారంలో నిమగ్నురాలైన సవిత రాఖాల్ తనను చేబదులు

అడిగినప్పుడు ఇవ్వలేకపోయింది. ఆటు తర్వాత తాను ఆశ్రయమిచ్చిన బాలవితంతువు శారద, రాఖాల్ చేబదులు ఎందుకు అడిగాడో, ఆరహస్యం కాస్తా సవితతో చెప్పేసింది. సవిత హృదయంలో ఒక్కుమ్మడిగా తుఫాను రేగింది. ఆమె తక్షణమే శారదతో కలిసి వ్రజబాబు ఇంటికివెళ్ళి రేణుప్రక్కన చివాలున వాలింది

ఇట్లా సవిత హృదయం ఆదుర్దాతో బ్రద్దలైపోతున్న విషమ సమయంలో రమణీబాబు కోటీశ్వరుడైన తన మిత్రుడు విమలబాబును స్వయంగా కలుసుకొని అతనితో పరిచయం కలిగించుకొమ్మంటూ సవితను నిర్బంధించాడు. ఆమె అనంగీకారానికి త్రాగుబోతైన రమణీబాబు మండిపడ్డాడు విమలబాబు రమణీబాబును, సవితను సింగపూరులోని తన స్వగృహానికి రావల్సిందని ఆహ్వానించగా రోగపీడితయైన తన పుత్రికకోసం దుర్భరావేదనతో క్రుంగిపోయిన సవిత ఆహ్వానం నిరాకరించింది మండిపడ్తూ రమణీబాబు సవితను కట్టి తీసుకొనివస్తానంటూ విమలబాబుతో జబర్దస్తీ మాటలు పలికాడు.

రమణీబాబు కర్కశంగా "నువ్వు నా భార్యవుకావని అందరికీ తెలుసు. ఒక అబద్ధం ఎన్నాళ్లు దాగివుంటుంది" అని వెటకారంగా ఎగతాళి చేశాడు. ఆత్మగౌరవంగల సవిత ఉద్రేకంతో "నేను ఎవరి భార్యనో వారి పాదధూళికి వున్న అర్హతైనా నీకులేదని గ్రహించావా?" అంటూ నిర్భయంగా అడిగేసింది. తనకిదివరదాకా రమణీబాబుతో వుంటూ వచ్చిన సంబంధ సూత్రాన్ని ఆమె త్రెంచివేసింది.

"మీరు ఇవ్వాళ కాకపోవచ్చు కాని, ఆరోజునయినా రమణీబాబును ప్రేమించలేదా? అమ్మా!" అని శారద సూటిగా వేసిన ప్రశ్నకు సవిత "లేదు, శారదా! రమణీబాబును ఆనాడూ ప్రేమించలా, ఈనాడూ ప్రేమించను" అంటూ నిజం పలికింది ఒకనాడు సవిత శారదను వెంటబెట్టుకొని వ్రజబాబు రేణులున్న పదహేడో నెంబరు యింటికి పోయింది కాళ్ళు కడుగు కోటానికి నీళ్లు తీసుకొని వచ్చిన తన అల్లారుముద్దు బిడ్డ రేణును, అమాంతం హృదయానికి హత్తుకుంది. ఆమె మాతృత్వం ఒక్కదఫా ఝంఝూమారుతంవల్ల కల్లోలితమైనసముద్రంలా పొంగి పొర్లింది స్పృహతప్పి తెప్పరిల్లిన తల్లికి రేణు భారాన్ని వ్రజబాబు ఎవరికి అప్పగిస్తాడా? అనే చింత పట్టుకొని వేధించింది

వ్రజబాబు తనకూతుర్ని వెంటబెట్టుకొని స్వగ్రామానికి వెళ్ళడం, ఆమెకు ఇష్టంలేదు. శాంత స్వభావుడైన వ్రజబాబు సవితయొక్క యావత్తు సొమ్మూ వడ్డీతో సహా ఆమెకు తిరిగి యిచ్చివేసి ఋణవిముక్తుడైనాడు; పన్నెండేళ్లక్రితం తాను సంసారం వదలిపెట్టి బైటికి వచ్చేసిన ఆ భూకంపం నాటిరాత్రి రసాతలం వరకు భూమి భేదించుకుంటే అలంఘ్యంగా ఏ పాషాణ స్థూపాలు ఇద్దరి మధ్యకు వచ్చినిల్చాయో అవి యీనాటికీ అలాగే అక్షయంగా నిల్చి పోయినట్లు సవిత గ్రహించి వాపోయింది.

క్రమేణా మృదుభాషీ ధీరస్వభావుడూ

హితకాంక్షీ యైన కోటీశ్వరుడు విమల బాబుతో సవితకు నిష్కల్మషమైన స్నేహం ఏర్పడ్డది. రమణిబాబుకు పైకం చెల్లించి విమలబాబు అతని ఇల్లు కొని సవితకు గృహదానం చేశాడు. సవితా విమలబాబులు సంస్కృతి కల వాళ్ళు. ఒకరి నొకరు అర్ధం చేసు కొన్నారు; ఒకరి విషాద జీవితపు అను భూతిని ఇంకొకరు సానుభూతితో విమ ర్శించు కొన్నారు. సవితతో విమల బాబు తనను ఒక అకృత్రిమ స్నేహి తుణ్ణిగా భావించ మన్నాడు. సవితకు పుత్ర సమానుడైన తారక్ బాబును చేర దీసి, అతడు కలకత్తాలో లాప్రాక్టీస్ చేయడానికి విమలబాబు ఎంతైనా సహాయంచేశాడు. న్యాయవాద వృత్తిలో అభివృద్ధిలోకి వస్తూన్న తారక్‌బాబుకి రేణు నిచ్చి పెళ్ళిచేసి, రేణును తన దత్త పుత్రికగా స్వీకరించి, ఆమెను తన యావ దాస్తికి ఉత్తరాధికారిణిగా చేయవలెనని దయాళువైన విమలబాబు సంకల్పించు కొన్నాడు. కాని అంతా అతను అనుకొ న్నట్లు కాలేదు పరమ లౌకికుడు స్వార్థ పరుడూ అయిన తారకుడు కళంకితయైన సవిత కూతుర్ని కృతఘ్నుడై నిర్మొగ మాటంగా నసేమి పెళ్ళి చేసుకోనన్నాడు అతను ధనికుడైనతన సీనియర్ లాయరు సోదరుని కూతుర్ని చేసికొని ఇల్లరికం వెళ్ళాడు

ఇది యిట్లా ఉండగా రాఖాల్‌బాబు శారదను తీసికొని హరిసిపూర్ వెళ్ళి" వృద్ధాప్యంలో తీవ్రమైన ఖాయిలాతులలో నై బాధపడుతూన్న వ్రజబాబుకి సరియైన చికిత్స చేశాడు. అష్టకష్టాలు పడుతూన్న పదహారేళ్ళ రేణుకు, రాఖాల్ శారదలు గృహ కృత్యాలలో తోడ్పడుతున్నారు. రేణు పట్టుదల మనిషి, ఆ అమ్మాయికి తండ్రి బాద స్తం, మూఢాచారాలూ అన్నీ పట్టుబడ్డాయి. తన తల్లిని తలవకండా, ఆమె ఆప్యాయంగా ఎన్నోవిషార్లు యిచ్చి వేయడానికని తెచ్చిన నగదునూ నగ లనూ నిర్మొగమాటంగా నిరాకరించే టంత స్వాభిమానవతి, పెంకి పిల్లానూ రేణు ! రేణు పెళ్ళి చేసుకోనన్నది. వార్ధక్యంలో కష్టపడే తన తండ్రిని నిరాధారంగా వదిలిపెట్టి ఆ అమ్మాయి రానన్నది. ఆమె కన్నతల్లియైన సవిత హృదయాన్ని ఆషాఢమేఘాలు క్రమ్మి వేశాయి. తనసంతానం యొక్క దుఃఖం వాళ్ళకష్ట జీవితాలూ సవితను అహర హమూ అగ్నికణాల్లో పొర్లించివేశాయి.

"సవితకు ఆమె జీవిత ప్రారంభ క్షణంలోనే పరిపూర్ణ యౌవనంలోనే, ప్రాణ సమానుడైన బలిష్ఠుడైన ఒక సుందర పురుషుడు, ఆమె జీవిత పథం లోకి వచ్చినట్లయితే, ఈనాడు ఉజ్వల మైన ఆమెనారీజీవితాన్ని, ప్రపంచంగానీ సంఘంగానీ, వేలెత్తి చూపెట్టగలిగేదా ? ఆదర్శజనని, మమతామయీ 'ఐన ఒక స్త్రీ అయేది కాదా" అని నవలా రచయిత సభ్యతా ప్రపంచాన్ని, చైత న్యవంతమైన మానవలోకాన్ని వేలెత్తి సూటిగా ప్రశ్నిస్తున్నాడు ప్రశ్న సబ బైనదంటూ, నిజమేనంటూ యిట్లాంటి (incompateble marriages) ఈడూ జోడూ కుదరని, "ముసలిమొగుడూ పడుచుపెళ్ళాం" రకపు దాంపత్యం సంఘ పురోభివృద్ధికి శ్రేయస్కరం

కాదంటూ సభ్యతాజగత్తు ఒప్పుకోక తప్పని విధంగా వాస్తవిక జీవిత సంఘటనలద్వారా శరత్చంద్రుడు ఒప్పించుతాడు శరత్చంద్రుడీనవలనువిషాదాంతం చేశాడు , అతడు అలా చేయాలని అనుకొన్నాడో లేదోగాని రాధారాణి అలా చేసింది ఎంతోఅభివృద్ధిచెందిన ఆధునిక వైద్యచికిత్సకు నోచని నిస్సహాయస్థితిలో బృందావనంలోని ఒక వైష్ణవబాబాజీమఠములో కేవలం హరినామ మంత్రోచ్చాటనమే ఔషధమైంది కలరాతగిలిన రేణుకు. మతమౌఢ్యానికి పదహారేళ్ళ అమాయక బాలిక అన్యాయంగా ఆహుతైపోయింది.

సవితా విమలబాబులు ఆ విషాదాంతిమవేళకు రేణు మరణ శయ్యను చేరుకొన్నారు. విరక్తిమార్గంలోవున్న సవిత ముఖంలో ప్రపంచంలోని దుఃఖమంతా కరడుగట్టిన ఛాయలు గోచరించాయి. ఆమె మంచుగడ్డలా చల్లబడిన కుమార్తె నుదిటిమీద ముద్దుపెట్టుకొని గొల్లుమన్నది. తర్వాత ఆమె, దుఃఖంతో కృశించిపోయిన వ్రజబాబు సేవాభారం వహించి జీవితశేషాన్ని అతని సపర్యకే అంకితం చేసింది.

ఈ నవలలో సవిత విమలబాబులు చాలాగొప్ప సంస్కృతి కలిగిన వ్యక్తులు వాళ్ళు జీవితాలలోని క్లిష్ట సమస్యలను ముఖ్యంగా ఆదర్శప్రేమ జన్మాంతరాలు, ఆదర్శ వివాహాలు, స్త్రీ పురుషుల సహజ సంబంధాలు, మొదలైన అంశాలను గురించిచేసిన వాదోపవాదాలు విమర్శనలు ఎంతో గంభీరమైనవీ; సత్యమైనవీ. ఇదివరదాకా భోగలాలసజీవితం నడిపిన, కోటీశ్వరుడు విమలబాబు, సవితకు ఇలా తన కృతజ్ఞతను తెలిపేడు . "ఇన్నాళ్ళనుంచీ నాహృదయంలో నిద్రపోతున్న 'సత్యమానవుణ్ణి' మేల్కొల్పావు నువ్వు నీ జీవితేతిహాసం నా జీవితంలోని భోగవిలాసాలకు స్వస్తిచెప్పింది సవితా " విమలబాబుయొక్క పై అభిప్రాయంతో అంగీకరించనివారంటూ పరితల్లో వుండరనే నా విశ్చితాభిప్రాయం శరచ్చంద్రుడు, సవితను మూర్తీభవించిన మాతృత్వమా ? అన్నట్లు గొప్పగా చిత్రించాడు. ఆమెపైన ఆగ్రహించిన వాళ్లుకూడా, ఆమె మానసికంగా నిరంతరం పడే తీవ్రమైన తల్లియొక్క ఆరాటం, ఆవేదన, ఆత్మవిమర్శా, అనాధ బాలురైన రాఖాల్ తారక్‌బాబులపైన ఆమె కుమ్మరించే వాత్సల్యాతిశయం, శారదవంటి పతితురాలైన బాలవితంతువుకు ఆశ్రయమిచ్చి ఆమెపట్ల చూపించిన ఆదరాభిమానాలూ, గమనించినపుడు వారుసైతం ఆమెపట్ల సానుభూతి ప్రకటించకపోరు వారి హృదయాంతరాళాల్లోఅనుకంప జనింపకపోదు; వారు విస్తుపోయి, ఆమె గుణాధిక్యతను సమధిక గౌరవభావంతో సమీక్షించకపోరు.

శరశ్చంద్రుడు రాఖాల్ తారక్‌బాబుల్ని సవిత శారదలను, వ్రజబాబునూ కళ్లకు కట్టినట్లు శక్తివంతంగా సృష్టించాడు. వారి విభిన్న శీలాలనూ, మనఃప్రవృత్తులను, ప్రవర్తనలనూ ప్రతిభావంతంగా ఈ నవలా రచయిత వర్ణించాడు.

ఈ 'సవితను' బెంగాలీనుండి, కథా రచనలో చేయితిరిగిన 'పాపికొండల' రచయిత శ్రీ సూరిగారు. సమర్థతతో తెనిగించారు. వీరి తెలుగు తర్జుమా సులభశైలిలో సరళంగా నడుస్తూంది.

— కొమర్రాజు వినాయకరావు.

చదువరులకు, ఏజెంట్లకు

## ఒక ముఖ్య సూచన

# అభ్యుదయ

వచ్చే నెల నుంచీ

విడి ప్రతి వెల : ఆరణాలు

సంవత్సర చందా : ఐదు రూపాయలు

(ప్రత్యేక సంచికలతో సహా)

అర్ధ సం. చందా : మూడు రూపాయలు

నలుగురు చందాదార్లను చేర్చినవారికి పత్రిక ఉచితంగా సంవత్సరం పంపబడుతుంది.

ఏజెంట్లు తమకు ఎన్ని ప్రతులు కావాలో

జులై 20 వ తేదీలోగా

ఆఫీసుకు తెలియ జేయాలి.

ఇట్లు,

నాగభైరవ శివరామకృష్ణయ్య

మేనేజరు. 'అభ్యుదయ' బెజవాడ, 1-7-1947

Editor, Printer & Publisher C Pitchayya
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet,
Printed at Prajasakti Press. Bezwada Q H. No. K. 3. A

G. No. 4784 ABHYUDAYA July-47 As. 8

కొత్త ముద్రణాలయం

*
* *

తెలుగులోను - ఇంగ్లీషులోను
సరిక్రొత్తగా
అందంగా

పుస్తక ప్రచురణ
జాబ్ ప్రింటింగు
కలర్ ప్రింటింగు

సకాలంలో - సక్రమంగా
చేయబడుతుంది!

* *
*

**అభ్యుదయ ప్రెస్**

గవర్నరుపేట - బెజవాడ